ఈ సంచికలో....



## విజ్ఞప్తి

గత నాలుగు నెలలుగా సృజన తన విజ్ఞప్తిలో పేర్కొన్న అనేక సమస్యలతో పాటు నవంబర్ నెల నుంచి ప్రింటింగ్ రేటు కూడ పెరిగినందువల్ల జనవరి 1985 సంచికనుంచి విడిప్రతి రూ॥ 3/- సంవత్సరచందా రూ॥ 30/-లు చేయక తప్పడం లేదు. సహకరించ వలసిందిగా పాఠకులను కోరుతున్నాం.

— సాహితీమిత్రులు


సృజన, హనుమకొండ 506 001 ఈ సంచిక రు. 2–50

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers, J. P. N. Road, Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal

ఏనుగు బతికినా ఏనుగంత విలువ. చచ్చినా ఏనుగంత విలువే- అన్నట్లు ఇందిరకు ఇప్పుడే నూరేళ్ళు నిండకపోతే శతజయంతి చేసుకుంటున్న కాంగ్రెసు పార్టీకి మాత్రం అధికారంలో నూరేళ్ళునిండేవే. ప్రజల్ని చంపయినా, తానుచచ్చియినా తన వర్గ వంశ పాలనను నిలబెట్టాలనే నెహ్రూ కుటుంబ సామ్రాజ్యవాద భూస్వామ్య విశ్వాస పాత్రతకు ఆమె రాజకీయ జీవితమంతా అంకితమైంది. నక్సల్బరీ నుంచి పంజాబ్‌దాకా, శ్రీకాకుళం నుంచి శ్రీనగర్ దాకా మనిషి రక్తం రుచి మరిగిన పులిలాగే ఆమె వ్యవహరించింది. అస్సాంలో 'ఎర్రిపిల్లల'ను వెంట బెట్టుకొని శవాలమీదుగా నడిచి ప్రజల రక్తాన్ని ఓట్లుగా పీల్చింది. పంజాబ్‌లో సిక్కుడిగితే రక్తం చిందించి మరో మారుహిందూ ఓటు బ్యాంకును స్థిరపరచుకున్నది. విధ్వంస రాజకీయాలు ఎల్లకాలం నిర్మాణాత్మక ఫలితాలివ్వజాలవు. ఎన్టీఆర్ పునర్నియామకంగానీ, స్వర్ణమందిరం నుంచి సైన్యం ఉపసంహరణకానీ ప్రజాస్వామిక చర్యగాకాక ప్రజలు ఎన్నికల ఎత్తుగడగానే భావించారు. ఆమె హయంలో 'హస్తం' భస్మాసుర హస్తమని పంజాబ్ నగ్నంగా రుజువుచేసింది. ఇంక ఆ చెయ్యి తన నెత్తి మీదనే పెట్టుకుంటే తప్ప తన వర్గాన్ని కాపాడలేని స్థితికి వచ్చింది.

ఆమె ఒరిస్సాలో చెప్పినట్లు అక్షరాల ఆమె తన చివరి రక్తపు బొట్టునుకూడ తంవాళ్ళకోసం అర్పించింది. ఆ అర్థంలో భారత రాజకీయ చరిత్రలో పాలక వర్గాల కోసం ప్రాణత్యాగం చేసిన అంత సమర్థులయిన నాయకులు ఇంకొకరు లేరు— అందుకే పిచ్చెక్కిన పాలక వర్గాలు, ఢిల్లీ మొదలుకొని ఏడు రాష్ట్రాల్లో ఒక హత్యకు వెల హత్యలు చేసారు. ('ఒక హత్యకు పది హత్యలు' అనే నినాదం గోడలమీద అనాగరికంగా, అమానుషంగా కనిపించే నాగరికులయిన అహింసావాదులకు, మానవతామూర్తులకు ఇంకా కన్నీళ్ళు తడిమారలేదు సత్యాగ్రహం చల్లారలేదు.)

జూలియస్ సీజర్ హత్య ఆంటోనీకే రాజ్యం తెచ్చినట్లు అధికారం రాజీవ్‌కే దక్కింది పార్లమెంటు లోక్‌సభలుకాదు, మెజారిటీపార్టీ, పార్టీలో మెజారిటీ, పార్లమెంటరీబోర్డుకూడ కాదు. ఒకరిద్దరి నిర్ణయాలతో పాలకవర్గాల అభీష్టాల కనుగుణంగా ప్రపంచంలోకెల్లా సువిశాల, సుస్థిరప్రజాస్వామ్యానికి రాజీవ్‌ప్రధానిగాఎన్నికయ్యాడు। (ఇరుగుపొరుగున వున్న ఇస్లాంరాజ్యంలో నయినా, మిలిటరీ పాలనలోనయినా దేశాధినేతలు ఎన్నికలు లేకున్నా మారారు. క్రమంతప్పకుండా మాత్రమే కాదు అపద్ధర్మంగా కూడ జరిగే భారతదేశం ఎన్నికల్లో వంశపాలన మూడవ తరంలో ప్రవేశించింది.) కరాచీ కాంగ్రెస్ మొదలు కన్నుమూసే వరకు సామ్యవాదం వల్లించిన ప్రజాస్వామ్యవాది నెహ్రూ భారత పీడిత ప్రజల పొలాలమీద చల్లడానికి తన బూడిద మిగిల్చాడు పంటలు భూస్వాములకు, కడుపు మంటలు పేదలకు పంచిపోయాడు. పాలించినంత

కాలం ప్రజల నెత్తుటి ఏరులు పారించిన ఇందిర చచ్చి తన అస్థికల కలశాల ప్రియ దర్శనం కలిగించింది. శ్మశానంలో ఏరుకుంటే ఏందొరుకుతాయి బూడిద, ఎముకలు తప్ప- ప్రజల కోసం కాంగ్రెస్ మిగిల్చిన శ్మశాన సంస్కృతి ఇది. ఈ శ్మశాన బీభత్సాన్నే శ్మశాన శాంతిగా, శ్మశాన సమైక్యతగా పత్రికల్లో, రేడియోలో, టెలివిజన్‌లో చిత్రించి ఓట్లు అడగడానికి మళ్ళీ వస్తున్నాయి ఎన్నికల రాబందులు, డేగలు, 'మతకల్లోలాల' శవాల కమురువాసన కమ్మిన ఆకాశంనిండా గోల గోలగా ఓట్ల పక్షులు రొద చేస్తున్నాయి.

ఒక్క నెహ్రూ ఇందిరల గురించి చెప్పుకోవడమంటే నాలుగు దశాబ్దాల పార్లమెంటరీ పార్టీల చరిత్ర వివరించడమే. జాతుల రక్తమాంసాలు హరించిన పులిజాతికి ప్రతినిధి కాంగ్రెస్. ఆ పాపపుణ్యాలు 'తిలాపాపం తలాపిడికెడు'. పులి జాతీయ మృగమయినట్లే కాంగ్రెస్‌కూడ ఒక జాతీయ పార్టీ. అదొక జాతీయ సంస్కృతి. దోపిడీ జాతీయ సంస్కృతి. ఆ సంస్కృతిలో పుట్టినవే అన్ని పార్లమెంటరీ పార్టీలు రూపంలో వేరువేరు పార్టీలుగా, మాటల్లో వేరువేరు మానిఫెస్టోలుగా, వేషంలో వేరు వేరు జెండాలుగా కనిపిస్తున్నా సారాంశంలో ఇవన్నీ దోపిడీ పార్టీలే. వీళ్ళంతా శవాల బేరగాళ్ళే. పాతబస్తీ మతకల్లోలాలనుంచి పంజాబ్ సమస్యదాకా పార్లమెంటు పరిష్కరించలేదు. కర్ఫ్యూలు పెట్టాల్సిందే. సైనికచర్యలు చేయాల్సిందే. కరువునుంచి తుఫాను దాకా ఎన్నికల ప్రచారానికి పనికొస్తాయితప్ప, హెలికాప్టర్లనుంచి తిలకించడానికి సుందర బీభత్స దృశ్యాలవుతాయి తప్ప వాటిని పార్లమెంటు ఆపలేదు అంటే మత కల్లోలాలకు, ప్రకృతి కల్లోలాలకు పార్లమెంటరీ రాజకీయాల్లో పరిష్కారాలు లేవు. (ఓట్లకోసం ప్రచారానికి పనికొస్తాయి తప్ప ఓట్లు ఆ కల్లోలాల్ని పరిష్కరించ లేవు) పంజాబ్, అస్సాం సమస్యలను ఎన్నికలు పరిష్కరించలేవని, లోక్‌సభ ఎన్నికలు అక్కడ జరపకపోవడం వల్ల ప్రభుత్వమే అంగీకరిస్తున్నది.

అయితే ఎన్నికలు ఎందుకు మరి? ప్రజల్ని మౌలిక సమస్యల నుంచి మరిపించడానికి ప్రభుత్వం సారా దుకాణాల్ని తెరచినట్లే పార్లమెంటనే జూదఖానా క్లబ్బును లాటరీ టికెట్లు అమ్ముతున్నట్లే, గుర్రప్పందాలు నడుపుతున్నట్లే కూడ తెరచింది.

ఇక్కడ మన దరిద్రం గురించిన చర్చలు జరుగుతాయి. ప్రభుత్వం తానే తయారుచేసి కంట్రాక్టర్లద్వారా పోలీసు లాఠీలతో సారా అమ్మినట్లుగానే, చట్టాలు తయారు చేసి లాఠీలతో తూటాలతో వడ్డిస్తుంది. ప్రజలు పన్నులు చెల్లించి, ఓట్లు వేసి ఐదేళ్లకోసారి సరికొత్త అణచివేత శాసనసభను ఎన్నుకోవాలి.

మనల్ని ఎవరు దోచుకోవాలో ఎన్నుకోవడంకన్నా ఎన్నికలు మనముందించిన ప్రత్యామ్నాయం లేదు.

కాని ఎన్నికలకు ప్రత్యామ్నాయం ఉంది. అదే నక్సల్బరీ మనముందుంచిన ప్రజాపోరాట పంథా. బూటకపు పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరించి ఆ నూతన ప్రజాస్వామిక విప్లవ పంథాను ఎంచుకోవడమే పోరాట ప్రజల ముందు నేడున్న కర్తవ్యం ఎన్నికల శవ మేలాలను బహిష్కరించి పోరాట జీవనాడి ప్రతిస్పందన నందుకోవడమే మనకు చరిత్ర నిర్దేశించిన మార్గం.

2-12-84

## ఫైజ్

కన్నీళ్ళని, నిట్టూర్పులను, వ్యర్థయవ్వనాన్ని కాలం కబళిస్తుందని విలపిస్తూ, 1928లో ఒక పందొమ్మిది సంవత్సరాల యువకుడు ఉర్దూ కవిత్వంలోకి ప్రవేశించాడు బలమయిన భావనాశక్తి, అద్భుతమయిన శబ్ద సౌందర్యంతో ఇతని మొదటి కవితా సంకలనం (నక్షా-యె-ఫిర్యాదీ) 1935లో వచ్చింది. కాని అప్పటికే ఈయువకవి వ్యర్థ యవ్వనాన్ని అధిగమించాడు. ఇప్పుడు మూడు దేశాలయిన ఉపఖండంలో, రెండు తరాలపాటు, మూడు భాషలలో (ఉర్దూ, పంజాబీ, హిందీ) సాహిత్యాన్ని ప్రభావితం చేసిన ఆ యువకుడే ఫైజ్ అహ్మద్ ఫైజ్. అప్పటికే లండన్ రచయితల మానిఫెస్టో ఇండియాలో ప్రచారం పొందింది. ప్రేమ్‌చంద్, సజ్జాద్‌జహీర్ల నాయకత్వంలో అభ్యుదయ సాహిత్యోద్యమం ముందుకు నడిచింది. ఉర్దూలో ఈ ఉద్యమానికి ఫైజ్ ప్రతీక అయ్యాడు ముప్ఫయిల నాటి ఆకలి సంవత్సరాలు వెన్నాడుతుంటే ఉద్యోగాలు మారుస్తూ పోయాడు. అమృతసర్‌లో, ఆతర్వాత లాహోర్‌లో అధ్యాపకుడిగా పని చేసి 1942లో యుద్ధంలో చేరాడు. నాలుగేళ్ళ తర్వాత కల్నల్ హోదాలో పదవీ విరమణ చేశాడు. ఆ మధ్య సంవత్సరాలన్నీ ఆయన కవిత్వంతోనే గడిపాడు. నక్షా-ఏ-ఫిర్యాదీ రాసిన యువ కవి భావనా శక్తి, కాల్పనికత మరింత బలంగా కొనసాగాయి. ప్రేమ, జీవితం కవితా ప్రతీకలుగా అలాగే కొనసాగాయి. మారిందల్లా వాటి లక్ష్యం. అర్థం మాత్రమే. హృదయాన్ని అమ్మి ప్రాణాన్ని కొంటాను అని రాసిన కవి తన హృదయాన్ని పీడిత ప్రజలకే ఇచ్చి, వాళ్ళ పెదాలమీద నాట్యమాడే గజల్ గీతమయ్యాడు. అందుకే 1947 ఆగస్టు 15 నెహ్రూకి 'లక్ష్యానికి ముహూర్తం' అయినపుడు, జిన్నాకు 'ఎన్నాళ్లు ఎదురుచూసిన ఉదయం' అయినపుడు కవిమాత్రం లెక్కపెట్టని మారణకాండల దారుణాల్ని వ్యక్తీకరించాడు. అయినా స్వాతంత్ర్యా నంతరం సరిహద్దుకిటువైపు ఉన్న తన పాత కామ్రేడ్స్‌లాగ ఆయనకూడా వ్యవస్థతో

రాజీపడ్డాడు. సినిమాలకి పాటలు రాశాడు. అధికార పత్రిక పాకిస్తాన్ టైమ్స్‌కి సంపాదకుడయ్యాడు. కానీ జిన్నా మరణంతోనూ, లియాఖత్ అలీఖాన్ హత్యతోనూ వచ్చిన సైనికపాలన మరోసారి ఆయన్ని పోరాట ప్రతిస్పందనలవయిపు నడిపించింది. సైనికపాలకులని విమర్శించాడు. రావల్పిండి కుట్ర కేసులో శిక్షకు గురిఅయి మాంట్ గోమరి కారాగారంలో ఆరేళ్లు గడిపాడు. 'జిందానామా' కవితా సంకలనం అప్పుడే వచ్చింది 1958లో విడుదలతో ఆయన జీవితంలో ఒక దశ ముగిసింది.

నిజానికి అభ్యుదయ సాహిత్యోద్యమానికీ దశముగిసింది. అప్పటికే అధికారంతో, వ్యాపారంతో శాంతియుత సహజీవనం చేస్తున్న అభ్యుదయ రచయితలకి అంతర్జాతీయ సైద్ధాంతిక ఆమోదాన్ని ప్రకటించాడు కృశ్చేవ్. ఫైజ్ తన మార్గాన్ని మధ్యలోనే వదిలేసాడు

వెనక్కి తిరిగి చూస్తే అభ్యుదయ సాహిత్యోద్యమం అర్థాంతరంగా తన ప్రయాణాన్ని వదిలివేయడంలో ఆశ్చర్యమయినదేదీ లేదనిపిస్తుంది. ఆ తరం అభ్యుదయవాదులు, చరిత్రకారుడు కోశాంబి భాషలో "పింక్ మార్క్సిస్టులు". మార్క్సిజం వాళ్ళకు శాస్త్రము కాదూ, శస్త్రము కాదు. అది బలమయిన భావోద్రేకాలతో వాళ్లు ఆకర్షితులయిన ప్రేయసిలాంటి ఒక కాల్పనిక ఆదర్శం. వాళ్ళని జీవితవాస్తవికత కంటె భావనాశక్తి నడిపించింది ఆ భావనాశక్తి అంతరించి తర్వాత వాళ్లురాజీపడ్డారు. అందుకే పాకిస్తాన్‌లో తర్వాత వచ్చిన మిలటరీ పాలకులతో ఫైజ్ శాంతియుత సహజీవనం చేయగలిగాడు.

ఆ తర్వాత కాలంలో ఆయన అడపాతడపా వర్తమాన రాజకీయ సంఘర్షణలకు ప్రతిస్పందించకుండా పోలేదు. ఆఫ్రికా విముక్తి పోరాటాలమీదా, లెబనాన్ అంతర్యుద్ధంమీదా అద్భుతమయిన గీతాలే రాసాడు. భుట్టో పాలనలో కొన్నాళ్లు ఈజిప్టుకి వలసపోయి మధ్య ప్రాచ్య దేశాలలో అరబిక్ సాహిత్య ప్రభావానికి గురి అయ్యాడు. తాను ఆ సాహిత్యాన్ని ప్రభావితం చేసాడు. కాని మొత్తంగా ఆయన అర్థాంతరంగా వదిలేసిన ప్రేయసికే తిరిగి వచ్చాడు. గత దశాబ్దికాలంలో రాసిన ఆత్మాశ్రయ కవితల సంకలనం 'మెరాదిల్, మెరా ముసాఫిర్' ఆయన ఆఖరి కవితాసంకలనం అయింది.

ప్రజల గుండెలమీద మతం సరిహద్దుల్ని గీసిన రాజకీయోన్మాద రక్తపాతానికి విలపిల్లిన కవి విడిపోయిన భూఖండం మీద కన్నుమూసాడు మత రాజకీయాల మారణహోమం మళ్లీ పొగలు కమ్మిన భారత ఆకాశంలో ఆ కళ్ళలో కొన్ని కన్నీళ్ళూ కొన్ని ఆకాంక్షలూ....

2-12-84

# సెలవు

జన

'గుడ్‌మార్నింగ్'
అని పలకరించింది చరిత్ర
పొద్దున లేచిన వెంటనే
కాళ్ళదగ్గర తెగిన తల దొర్లిపడింది

సంతాప సంగీతాల రోదనలో
భయపడాలో సంతోషించాలో తేల్చుకోలేక
సంపాదకీయాలన్నీ చదివినా
అంతమయింది అధ్యాయమో శకమో అర్థంకాక
నే వీథిన పడ్డా

వీధుల్లో దారుల్లో
జనం ఎవరూ లేరు
జన సమూహాలు తప్ప

అబద్ధపు అమరత్వాన్ని పొంది
శిథిల శిలా విగ్రహాలయిన చౌరస్తాహీరోల దగ్గర
వాళ్ళ సందేహాలకు ఉద్రేకాలకు గమ్యం :

నాకు మాత్రం
ముందుకు వెళ్తే
కిరాణా దుకాణాలు కాదుగదా
చాయ్‌కొట్టు కూడ లేదు

ఎక్కడ చూసినా
వాళ్ళంతా కళాత్మకంగా ఏడుస్తూ కన్పించారు
ఏవో పాతబడిన మోనాటనస్ శృతులతో

చీకటిపడే వేళ
రానున్న మూడురోజుల సెలవుదినాల్ని తల్చుకుంటూ
వాళ్ళింటి ముఖం పట్టేదాకా

# మతవాదం మీద విమర్శ రాజకీయాల మీద విమర్శే

మనిషే మతాన్ని తయారుచేస్తాడు, మతం మనిషిని తయారు చేయదు. తాను గుర్తించలేని మనిషికి, తనను తాను మళ్ళీ పోగొట్టుకున్న మనిషికి మతం స్వీయ చైతన్యం, స్వీయ గౌరవం. కాని మనిషి ప్రపంచానికి బైట ఉన్న అనిర్దిష్టజీవికాడు. మనిషే మానవ ప్రపంచం, రాజ్యం, సమాజం ఈ రాజ్యం, ఈ సమాజం తాము తలకిందుల ప్రపంచం కావడంవల్ల ఒక తలకిందుల ప్రాపంచిక చైతన్యాన్ని మతాన్ని తయారుచేస్తాయి. ఆ ప్రపంచపు సాధారణ సిద్ధాంతం, దాని విజ్ఞాన సర్వస్వ సారాంశం, ప్రజామోద రూపంలో ఉన్న దాని తర్కం, దాని ఆధ్యాత్మిక గౌరవ కారణం దాని అనక్తి, దాని నైతిక అనుమతి, దాని నిబ్బరమైన కానుక, ఓదార్పుకూ, సంజాయిషీకీ అదిఇచ్చే సార్వజనికమూలం మతమే. మానవసారం వాస్తవికతలో లేనందుచేత, మతమే మానవసారపు అద్భుత గుర్తింపు. అందువల్ల మతవ్యతిరేక పోరాటం పరోక్షంగా— మతం ఏ సమాజపు ఆధ్యాత్మికశోభగా ఉన్నదో ఆ సమాజానికి వ్యతిరేక పోరాటమే.

మత వేదన వాస్తవ వేదనకు వ్యక్తీకరణే. అదే సమయంలో అది వాస్తవ వేదనపట్ల నిరసన కూడా. మతం అణచబడ్డ జీవి నిట్టూర్పు, హృదయంలేని ప్రపంచపు హృదయం, ఉత్సాహంలేని పరిస్థితులఉత్సాహం. అది ప్రజలకు మత్తుమందు.

---

నేనవే దారులమ్మట మళ్ళీ మళ్ళీ తిరిగా
పదే పదే జరిగే ఒకే ఒక్క సంఘటనలా

ఆ రాత్రి
ఈ చక్రి భ్రమణాన్ని వదిలి వెళ్లామనే
నిర్ణయానికొచ్చా
ఇంత మంది సామ్రాజ్యాధినేతల తెగిపడిన
తలల్ని తనలో కలుపుకుని
ఇన్ని శతాబ్దాల "నాగరికుల్ని" కండిషన్ చేసిన
ఈ భ్రమా భ్రమణాన్ని వదిలి నడచివచ్చా
చరిత్రకు గుడ్ బై చెప్పి
వాళ్ళ చరిత్రకు గుడ్ బై చెప్పి

31 అక్టోబర్ 1984

ప్రజల భ్రమాజనిత ఆనందంగా ఉన్న మతాన్ని రద్దుచేయడమంటే ప్రజల వాస్తవమైన ఆనందాన్ని ఆకాంక్షించడమే. ప్రస్తుత స్థితిపట్ల భ్రమల్ని వదిలేయమని కోరడమంటే, భ్రమలు అవసరమయ్యే పరిస్థితుల్ని వదిలెయ్యమని కోరడమే. అందుకే మతం మీద విమర్శ. ఏ కన్నీటి ప్రవాహాల వెలుగు మతమో, ఆ కన్నీటి ప్రవాహాల మీద విమర్శకు బీజరూపమే.

విమర్శించడమంటే హారంనుంచి ఊహాజనిత పుష్పాల్ని రాల్చివేయడమనే. కాని మనిషి అలంకారంలేని, ఆనందంలేని హారం ధరించాలని కాదు అతను హారాన్ని దులిపి, వాస్తవ పుష్పాన్ని స్వీకరించే వీలు కలిపించేదే విమర్శ. మత విమర్శ మనిషిని భ్రమలనుంచి మేల్కొలిపి, భ్రమలు పోయిన మనిషి హేతుబద్ధంగా ఆలోచించినట్టుగా ఆలోచించేట్టు, తన వాస్తవికతను రూపొందించేట్టు చేస్తుంది. అలా అతను తనచుట్టూ తాను, అంటే తన సూర్యునిచుట్టూ తాను తిరుగుతాడు మనిషి తనచుట్టూ తాను తిరగనంతవరకూ మతంమనిషిచుట్టూతిరిగే ఒక ఊహాజనితసూర్యుడు.

అందువల్ల వాస్తవాన్ని మించిన ప్రపంచం అదృశ్యం కాగానే చరిత్రకర్తవ్యం ఈ ప్రపంచపు వాస్తవాన్ని నిర్ధారించడం అవుతుంది. మానవ స్వీయ పరాయీకరణ పవిత్రరూపం బట్టబయలు కాగానే. తత్వశాస్త్రపు తక్షణ కర్తవ్యం పరాయీకరణను దాని అపవిత్రరూపాల్లో బట్టబయలు చేయడం అవుతుంది. ఆ రకంగా స్వర్గంపై విమర్శ భూమి మీద విమర్శగా మారుతుంది. మతం మీద విమర్శ చట్టం మీద విమర్శగా, మతవాదం మీద విమర్శ రాజకీయాలమీద విమర్శగా మారుతుంది.

—మార్క్స్

( ఇంట్రడక్షన్ టు ది క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ఫిలాసఫీ ఆఫ్ లా )

## మరో గాంధీ మరణం

మొన్న అక్టోబర్ 31న జరిగిన ఇందిరాగాంధీ హత్యతో ఉత్తర భారత దేశమంతా పెద్ద ఎత్తున మత కల్లోలాలు రేగాయి. ఢిల్లీ, బీహార్, ఉత్తర ప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, హర్యానా, పంజాబ్, హిమాచల్ ప్రదేశ్, బెంగాల్, త్రిపుర, ఒరిస్సా, రాజస్థాన్‌లలో పెద్ద ఎత్తున జరిగిన మారణకాండలో ఎన్ని వేల మంది మరణించారో లెక్క పత్తాలేదు. ఈ సారి ఘర్షణలు సిక్కులకు హిందువులకి మధ్య. ఈ సంవత్సరం పొడుగూతా హిందువులకి ముస్లిమ్‌లకి

మధ్య అనేక ప్రాంతాలలో ఘర్షణలు జరిగాయి. గత సంవత్సరం కేరళ తమిళ నాడులలో క్రిస్టియన్‌లకు హిందువులకి మధ్య ఘర్షణలు జరిగాయి. మొత్తం మీద గత రెండునెలల కాలంలోనే దేశం 16 రాష్ట్రాలలో, 80 నగరాలలో, 50 జిల్లాలలో మత కల్లోలాలు రేగాయి. ఇంత పెద్దఎత్తున, ఇంత విస్తృతంగా బహుశా 1947లో కూడ జరగలేదు. సెక్యులర్ (దీనికి తెలుగు అనువాదం 'లౌకికం' ఎలా అవుతుందో భగవంతుడికి తెలియాలి) రాజ్యం అని చెప్పుకొనే దేశంలో, సెక్యులర్ రాజ్యాంగ చల్లని దీవెనలతో, మతోన్మాద పార్టీలుకాదు సెక్యులర్ పార్టీలు రెచ్చగొడ్తున్న మత కల్లోలాలివి.

ఏమిటి సెక్యులరిజమ్?

ఎక్కడ పుట్టింది ఈ సెక్యూలరిజమ్?

నిఘంటు అర్థంలో విద్య, నీతి, ప్రజాజీవనం మతం మీద ఆధారపడి ఉండ గూడదనే భావనని సెక్యులరిజం అంటారు. ఇది బలంగా మన దేశ రాజకీయాల లో 1920ల చివరి దినాలలో ప్రవేశించింది. దేశంలో అప్పుడేపుడుతున్న ఆధునిక మతోన్మాదానికి ప్రతి చర్యగా ఈ భావన వచ్చింది. మతోన్మాదం, సెక్యులరిజం రెండూ కూడ సామ్రాజ్యవాద ఫలితాలే.

మన దేశంలో సామ్రాజ్యవాద పెట్టుబడి ప్రత్యేక రాజకీయ పరిమితుల్లో ప్రవేశించింది. ఈ పరిమితుల్లో భూస్వామ్య దోపిడీనీ, ప్రివిలెజ్‌నీ చట్ట రూపేణా నూ (శాశ్వతసెటిల్‌మెంట్) సాయుధ బలగాలతోనూ స్థిరపరిచిన తర్వాతే సామ్రాజ్యవాదులు తమపెట్టుబడిని ప్రవేశపెట్ట గలిగారు. దేశ ఆర్థిక పునాదిలో పెట్టుబడి మార్పులు తీసుకువచ్చే క్రమం దానికి విరుద్ధమైన క్రమంతో ముడిపడి ముందుకు సాగింది. సామాజిక జీవితంలో భూస్వామ్య సంస్కృతి, భావజాలం సమాజం ముందుకెళ్తున్నకొద్దీ బలపడింది. మతం ఈ భావజాలంలో భాగమే ప్రపంచంలో ఇతర ప్రాంతాలలో భూస్వామ్య దోపిడీనీ సంస్కృతినీ నాశనం చేసి పుట్టుకొచ్చిన పెట్టుబడి ఇక్కడమాత్రం వాటిమీదే ఆధారపడుతూ వచ్చింది. భూస్వామ్య బలం మీదే పెట్టుబడి పునరుత్పత్తి క్రమంకూడ ఆధార పడింది. పెట్టుబడి ప్రవేశం మత విశ్వాసాలను, సంస్థలను, ప్రతీకలను, భావజాలాన్ని బలోపేతం చేసింది.

ఈ శతాబ్దారంభంలో సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం మధ్యతరగతిని దాటి ప్రజల్ని ఆకట్టుకునే దశకు చేరుకున్నప్పుడు మతమే ప్రజల మధ్య వైరుధ్యాల్ని తీవ్ర

తరం చేయడానికి సామ్రాజ్యవాదుల చేతిలో ఆయుధమయింది. మత పునాదిగా ఏర్పడిన ప్రజాసమూహాలమధ్య ఐక్యతను, వాటివల్ల యితర ప్రజాసమూహాలతో వచ్చిన అనైక్యతని కాంగ్రెస్ గుర్తించ నిరాకరించింది. హిందూ పునరుద్ధరణ వాదంతోనూ ఖిలాఫత్ ఉద్యమంతోనూ ప్రజల్ని ఆకర్షించుకున్న స్వాతంత్ర్యోద్యమం అనివార్యంగానే మతంమీద ఆధారపడింది. ఈ ఉద్యమంతో నిమిత్తం లేకుండా, మత ప్రమేయం లేకుండా సామాజికమార్పుకోసం పీడిత ప్రజాపోరాటాలు జరగకుండాపోలేదు. ఐతే కాంగ్రెస్ పనికట్టుకుని స్వాతంత్ర్యోద్యమంతో వాటికి సంబంధం లేకుండా చేసింది. మన రాష్ట్రంలోనే కాంగ్రెస్ నాయకత్వంలో మొదలైన కాశీపట్నం జమీందారీ వ్యతిరేక పోరాటాన్ని మహాత్మాగాంధీ దగ్గరుండి ఖండించాడు కూడా. దోపిడీ సమాజంలో మార్పును ఆచరణలో కాంగ్రెస్ వ్యతిరేకించింది. ఆ దోపిడీకి ప్రజా అనుమతి సృష్టించడంకోసం వేల సంవత్సరాలుగా పనిచేస్తున్న మతాన్ని. మత విశ్వాసాలను కాంగ్రెస్ వ్యతిరేకించ నిరాకరించింది. నిజానికి గాంధీ జిన్నాలిద్దరూ మత ప్రతీకలతోనే ప్రజల్ని ఆకట్టుకున్నారు.

ఈ చారిత్రిక సందర్భంలో సెక్యులరిజం అనే భావన రాజకీయాల్లో ప్రవేశించింది. "మతాతీత రాజకీయ" భావనను వ్యక్తీకరించి ప్రచారం చేసినవాడు నెహ్రూ. అది కేవలం ఒక రాజీ ధోరణి మాత్రమే. మతాన్ని వ్యతిరేకించకుండా మతాతీత రాజకీయాల గురించి మాట్లాడడం దాని లక్షణం. సెక్యులరిజానికి భౌతిక పునాది లేదు. ప్రాపంచిక దృక్పథం లేదు మతం రాజకీయార్థిక వ్యవస్థకు ఒక అవసరమైనప్పుడు ఆ వ్యవస్థను సమర్థించేవాళ్ళు తమకు తామేర్పరచుకున్న ఒక రాజకీయ ఏర్పాటుగా సెక్యులరిజం మనదేశంలో ప్రవేశించింది.

సెక్యులరిజం మతానికి వ్యతిరేకంగా చేసిందేమీలేదు. మత పునాదిగా ప్రజల, ప్రజాసమూహాల విభజనను నివారించిందీలేదు. చివరికి మత పునాదిగానే దేశ విభజన జరిగింది. మూడు దశాబ్దాలపాటు కాంగ్రెస్ ప్రచారం చేసిన సెక్యులరిజం గాలిమూట అయిపోయింది. మతకల్లోలాలలో వేలాది ప్రజలు మరణించారు. హిందూ మతోన్మాదుల చేతుల్లో గాంధీ, ముస్లింమతోన్మాదుల చేతుల్లో లియాఖత్ అలీఖాన్ మరణించారు. కేవలం రైతాంగపోరాటాలు జరుగుతున్న ప్రాంతాలు తప్ప మిగతా దేశమంతా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ మత విద్వేషాల ప్రభావానికి గురయింది. తమ ప్రాపంచిక దృక్పథంలో మతాన్ని వ్యతిరేకించినవి కావడం వల్లే ఈ రైతాంగ పోరాటాలు మత ప్రభావాన్ని నివారించగలిగాయి.

1947 దేశంలో తీసుకొచ్చిన మార్పులు ఇతరత్రా ఎంత ప్రాముఖ్యంగలవైనా సారాంశంలో రాజకీయార్థిక వ్యవస్థలో ఏ మార్పులూ తీసుకురాలేకపోయాయి. భూస్వామ్య భావజాలాన్ని, ప్రివిలెజ్‌ని మత విశ్వాసాలని బలోపేతం చేసే పెట్టుబడి మరింతగా దేశ ఆర్థిక పునాదిలో చొచ్చుకు పోయింది. అభివృద్ధి చెందిన సాంకేతిక పరిజ్ఞానం అందుకు ఉపయోగపడింది. ఆధునిక రాజ్యాంగ యంత్రపు సాయుధ బలగాలు అందుకు తోడ్పడ్డాయి. మత విశ్వాసాలకి సాంఘిక అనుమతి, సాధికృత మరింతగా పెరిగాయి. భూస్వామ్యాన్ని నాశనం చేయకుండా ప్రవేశించిన పెట్టుబడి ఆర్థిక పునాదిలో సృష్టించిన వైరుధ్యానికి రాజకీయ రూపంగా మతాన్ని వ్యతిరేకించకుండా "మతాతీత రాజకీయం" చెప్తూ దేశం "సెక్యులర్" దేశమయింది. ఏ రాజ్యాంగం దేశాన్ని సెక్యులర్ దేశంగా ప్రకటించిందో ఆ రాజ్యాంగమే మత పునాదిగా ఏర్పడిన సివిల్ కోడ్‌కు చట్టరీత్యా ఆమోదాన్నిచ్చింది 'సెక్యులరిజం' రాజ్యాంగంకంటె అందమైన అబద్ధంగా ప్రచారంలోకి వచ్చింది. అది పాలకవర్గాల సరికొత్త పుక్కిటి పురాణం అయింది.

ఈరకం రాజకీయార్థిక వ్యవస్థలో ఏ సంక్షోభమైనా మత విశ్వాసాలను, మతోన్మాద స్థాయికి తీసుకువెళుతుంది మతపునాదిగా ప్రజలమధ్య విభజన మత కల్లోలాలకు దారితీస్తుంది. ప్రస్తుతం మనదేశంలో ఈరకం సంక్షోభం తీవ్రమయింది. ఆర్థిక పునాదిలో భౌతిక ఉత్పత్తి క్రమం, అదనపు విలువ ఉత్పత్తి క్రమం, పునరుత్పత్తి క్రమం కుంటుపడి ఇతర రేతర ఆర్థికకార్యకలాపాలు విజృంభిస్తున్నాయి. (సారా కంట్రాక్టుల నుంచి సినిమాలదాక) ఈ సంక్షోభం రాజకీయరంగంలో మరింత కొట్ట వచ్చినట్టు కనబడుతుంది. రాజ్యాంగం నిర్దేశించిన రాజకీయ నిర్మాణ స్వరూపాలన్నీ గవర్నర్లనుండి మునిసిపాలిటీలదాకా- తమ విధిని తామే ఉల్లంఘిస్తున్నాయి. నేరస్తులే చట్టాల్ని తయారుచేస్తున్నారు. చట్టాల్ని అమలు పరచాల్సిన వాళ్ళు చట్టాల్ని ఉల్లంఘిస్తున్నారు. ఎన్నికల ప్రజాస్వామ్యం పెద్ద ప్రహసనమయిపోయిందని అందులో విశ్వాసం ఉన్నవాళ్ళే అంగీకరించక తప్పడంలేదు ఈ ప్రహసనంలో పరిస్థితి అనిశ్చితమవుతున్న కొద్దీ మత విశ్వాసాలు అందరికి అవసరమయిపోయాయి మతోన్మాద పార్టీలకి, ఆ తర్వాత సెక్యులర్ పార్టీలకి. ఈ విశ్వాసంమీదే పూర్తిగా ఆధారపడటం అలవాటయిపోయింది. చివరికి బోనాల ఊరేగింపులో లెనిన్ బొమ్మను తీసుకెళ్ళే స్థాయికి కమ్యూనిస్టులు కూడా దిగజారక తప్పలేదు. నమ్మించడానికి నిజాయితీగల సెక్యులరిస్టులు కూడా ఎవరూ లేకుండా పోయారు. సెక్యులరిజమ్ ఒక కల్లోలానికి

మరో కల్లోలానికి మధ్య ఎవరూ పట్టించుకోని కాయితపు శాంతి తీర్మానం అయిపోయింది. చరిత్రలోను, వర్తమాన రాజకీయార్థిక వ్యవస్థలోనూ పునాదిలేని బలహీనమయిన భావనగా సెక్యులరిజమ్ తననుతాను బహిర్గతం చేసుకొంది.

ఈ సంక్షోభ ఫలితమే ప్రస్తుతం దేశవ్యాపితంగా చెలరేగుతున్న మత కల్లోలాలు. కొన్నిచోట్ల ప్రజలకు ప్రజలకు మధ్య విద్వేషాలుగా కన్పిస్తున్నా ఎక్కువచోట్ల ఇవి సంఘటితశక్తుల ప్రభుత్వ సహాయంతో నడుపుతున్న మారణకాండగానే కొనసాగుతున్నాయి. ఈ మతోన్మాదానికి అంతర్గత చలన సూత్రం ఒకటుంది. ఒకరిద్దరు వ్యక్తులు నరేంద్ర, ఒవయిసీ ఒకటి రెండు పార్టీలు(బిజెపి, మజ్లిస్), ప్రజలలో విద్వేషాలకు బీజాలువేస్తే ప్రభుత్వ ప్రోత్సాహంతో అవిపెరిగి పెద్దవవుతాయి. తుదకు అవి పాలకుల శాంతి భద్రతకే ముప్పుకలిగించి కల్లోలాలకు దారితీస్తాయి. ప్రభుత్వం నిర్బంధాన్ని తీవ్రతరం చేస్తుంది. ఆపేరుతో దేశవ్యాపితంగా నిర్బంధానికి, నిర్బంధ చట్టాలకు ప్రజామోదాన్ని పొందుతుంది. నిర్బంధానికి గురిఅయిన ప్రజలకు మతానికి మధ్య అనుబంధం మరింత పెరుగుతుంది. అందులో ఉన్మాదులు కొందరు ప్రతీకార చర్యలు మొదలెడ్తారు చివరికి ప్రతిగా ఇతర మతాలు దాడిచేస్తాయి, ప్రతి కల్లోలం మరో కల్లోలానికి దారులు వేస్తుంది. 1920 ల నాటి ఈ క్రమం పదే పదే పునరావృతమవుతూ వస్తోంది. మతోన్మాదపు అంతర్గత చలనానికి ప్రారంభోత్సవం చేసిన మహాత్మాగాంధీ ఇందిరాగాంధీ లిద్దరు ఆ చలన పరిణామాల ఫలితంగానే మరణించారు.

అయితే ఆ గాంధీ సుమారు సంవత్సరకాలంపాటుసాగిన దారుణకాండకు చివరి (అప్పటికి)విరామ చిహ్నంగా మరణిస్తే ఈ గాంధీమరణంతో ఒక భయంకర మారణకాండ మొదలయింది మరో రెండు మతాలమధ్య, తరాలపాటుసాగే స్వార్థ వైషమ్యాలకి మొదటి దశ ప్రస్తుతానికి పూర్తయింది.

పాతమత విశ్వాసాలకి జీవంపోస్తూ, కొత్తగా ఇతర ఈ మతస్థులని ఈ మంటలలో కలపుకుంటూ క్రమక్రమంగా విస్తృతమవుతున్న ఈ మతోన్మాదానికి సెక్యులరిజం సమాధానం కాలేదు అయ్యే ఉద్దేశ్యంకూడ దానికి లేదు. ఈ మతోన్మాదాన్ని అవసరంగా చేసుకున్న రాజకీయార్థిక వ్యవస్థతో నిమిత్తంలేకుండా మతాన్ని వ్యతిరేకించే ఏ ధోరణీ దీన్ని ఎదుర్కోలేదు. అందుకే మతాన్ని, మతవిశ్వాసాలని, మతప్రతీకలను నిర్ద్వంద్వంగా వ్యతిరేకించాలి. ఏరాజకీయార్థిక వ్యవస్థను బలోపేతం చేయడంకోసం మతం వ్యాపించిందో, ఆ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే విప్లవ పోరాటంలో భాగంగా, ప్రత్యక్షంగా మతానికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించాలి.

— సురా

కయ్యూరు వీరుల గాథ

# తేజస్వినీ తీరాన...

పృథ్వి

దక్షిణ భారతంలో ఉజ్వల పోరాట చరిత్రగల రెండు ప్రాంతాలు ఒక క్రూరమైన యాదృచ్ఛికతలో ఏకమయ్యాయి. తెలుగువాళ్ళకు ముఖ్యంగా కోస్తా జిల్లాల వాళ్ళకు- మలబార్ అనేది ఒక భయంకర, విషాద జ్ఞాపకం. పాశవికత మూర్తీభవించిన మలబార్ స్పెషల్ పోలీసుదళం (ఎంఎస్‌పి) తెలుగునాట రేపల్లె మొదలుకొని రాజోలుదాకా సాగించిన దారుణ దమనకాండ ప్రజలకింకా గుర్తుంది. కృష్ణాజిల్లా కాటూరు, ఎలమర్రు గ్రామాల మీదపడి మలబార్ పోలీసు చేసిన దురాగతాలు తెలుగు ప్రజల చరిత్రలో ఇంకా మాసిపోలేదు ఆ గ్రామాల్లో మలబార్ పోలీసులు ప్రజలను నగ్నంగా గాంధీ విగ్రహం చుట్టూ తిప్పారు. ప్రజలను బలవంతంగా విగ్రహ మహాత్ముని ముందర సాగిలపడేసి మొక్కించారు. గొంతులమీద బయొనెట్లు ఆన్చి 'మహాత్మాగాంధీకీ జై' అని నినాదాలిప్పించారు. ఆ రోజుల్లో కృష్ణా, గుంటూరు జిల్లాల్లో వెల్లివిరిసిన పోరాటచైతన్యాన్ని కాలరాయడానికి తెలుగునేలమీద ఉక్కుపాదం మోపిన మలబార్ పోలీసు ఒక గొప్ప పోరాట సాంప్రదాయంగల ప్రాంతాన్నుంచే వచ్చింది. ఒక శతాబ్దానికి మించి పోరాట చరిత్రగల మలబార్ నుంచి వచ్చిన ఈ పారామిలిటరీ దళాన్ని బ్రిటిష్ పాలకులు 192[illegible]ల మోప్లా తిరుగుబాటును అణచి వేయడానికే సృష్టించారు.

ఉరికంబంమీద నిలిచి ఉజ్వల గీతిక పాడిన కయ్యూరు వీరుల పోరాట సాంప్రదాయపు మూలాలు ఈ మలబార్ పోలీసులు అణచివేసిన మలబార్ రైతాంగ పోరాట చరిత్రలోనే ఉన్నాయి. మలబార్ పోలీసును మాత్రమే కాదు, ఉరితాళ్ళను కూడ గేలిచేసి కయ్యూరు రైతులు అరుణతారలుగానిలిచి తమప్రాంత రైతాంగపోరాట చరిత్రలో మరొక అధ్యాయాన్ని తమ రక్తంతో రాశారు.

ఇవాళ్టి కేరళలోని ఉత్తరభాగం మలబార్ జిల్లాగా బ్రిటిష్ పాలనలోని మద్రాస్ రాష్ట్రంలో భాగంగా వుండేది తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాలలో, మలబార్ జిల్లాలో విడదీయబడ్డ మలయాళీ ప్రజలను మరింత విడదీసి, బ్రిటిష్‌పాలకులు కాసరగోడు తాలూకాను దక్షిణ కనరా జిల్లాలో కలిపారు. పది తాలూకాలతో తూర్పున

పడమటి కనుమలు, పశ్చిమాన అరేబియా సముద్రం, ఉత్తరాన దక్షిణ కనరా జిల్లా, దక్షిణాన కొచ్చిన్ సంస్థానం సరిహద్దులుగా గల 5800 చదరపు మైళ్ళ భూభాగమే బ్రిటిష్‌వాళ్ళ లెక్కల్లో మలబార్ జిల్లా. మలబార్ 1792లో టిప్పుసుల్తాన్ చేతినుంచి ఈస్టిండియా కంపెనీచేత చిక్కింది.

బ్రిటిష్‌వాళ్లు ప్రవేశించిన సమయానికి మలబార్‌లో అమలవుతుండిన వ్యవసాయ సంబంధాలు ఒక ప్రత్యేక రకమైనవి. భూమి ఎవరి స్వంతమూ కాదు. భూమిమీద అధికారం, యాజమాన్యం ఎవరికీ ఉండేది కాదు. ఈ కారణంవల్లనే టిప్పుసుల్తాన్ కాలం వరకూ భూమిమీద "ప్రభుత్వ శిస్తు" అనబడేది కూడ లేదు. కాని ఉన్న వ్యవసాయ సంబంధాలలో మూడు తరగతులవాళ్లు ఉండేవాళ్ళు. జన్మభోగం (జన్మహక్కు)గా పండినపంటలో మూడోవంతు అనుభవించే 'జెన్మి'పంటలో మరో మూడోవంతు అనుభవిస్తూ పర్యవేక్షణ చేసే కనందార్, సాగుచేసి పంటలో మూడోవంతు తీసుకునే వెరుంపట్టందార్. ఈ మూడు తరగతుల్లో జన్మి కనందార్ తరగతులు రెండూ సాగుచేయని తరగతులే. వెరుంపట్టందార్ మాత్రమే సాగుచేసే రైతు. కనందార్ అనే మాటకు మళయాళంలో చూసేవాడు అని అర్థం కనుక బహుశా ఈ తరగతి జెన్మిల సేరిదారు తరగతి కావచ్చు. ఐతే జెన్మికి భూమిమీద భూస్వామికి ఉండే అధికారాలు లేవు. జన్మభోగాన్ని మూడోవంతునుంచి పెంచడానికి అతనికి హక్కులేదు. భూమి అతని స్వంతం కాదు గనుక వెరుపట్టందారును బేదఖలు చేయించే అధికారం కూడ అతనికి లేదు. ఈ ప్రత్యేక వ్యవసాయ సంబంధాలను బ్రిటిష్‌వాళ్ళు అర్థంచేసుకోలేక పోయారని 1881లో మరో బ్రిటిష్ అధికారే గుర్తించాడు. వాళ్లు తమ దేశపు ఫ్యూడల్ దృక్కోణంనుంచేచూసి భూస్వామి, కౌలుదారు, ఉపకౌలుదారు (లేదా రైతు, లేదా కూలీ) అనే మూడు తరగతులుగా జెన్మి, కనందార్, వెరుంపట్టందార్లను లెక్కించారని ఆయన రాశాడు. (ఇ ఎం ఎస్ నంబూద్రిపాద్, ఎ షార్ట్ హిస్టరీ ఆఫ్ ది పెజంట్ మూవ్‌మెంట్ ఇన్ కేరళ, పి పి ఎచ్, 1943)

ఆ సమయానికి సాంఘిక సంబంధాల అంతస్తులలో పైనఉన్నది అగ్రవర్ణ హిందువులు, నంబూద్రిలు, నాయర్లు. అట్టడుగున ఉన్నది హిందూ అస్పృశ్యులు, ముస్లింలు. (అతి తక్కువ సంఖ్యలో ముస్లింలు పై అంతస్తుల్లోకూడ ఉండేవారు). మిగిలిన చోట్ల కంటె కేరళలో భయంకరంగా అమలయిన అస్పృశ్యత వల్ల సాంఘిక

సమానత్వం కోసం మత మార్పిళ్ళు అప్పుడే ప్రారంభమయ్యాయి, 1921 లెక్కల ప్రకారం మలబార్‌లోని 31 లక్షల జనాభాలో 20 లక్షల హిందువులుండగా, 10 లక్షల ముస్లింలున్నారు. ఈ ముస్లింలుకూడ ఇతరప్రాంతాల ముస్లింల కంటె భిన్నంగానే ఉండి మాపిళ్ళ (ఇంగ్లీషువాళ్ళు ఈ మాటనే మోప్లా చేశారు)లని పిలువ బడేవారు. "భూస్వామ్యహక్కులపట్ల అతి శ్రద్ధతో బ్రిటిష్ పాలకులు హిందూ అగ్రవర్ణ నంబూద్రి, నాయర్ జెన్మిలస్థానాన్ని పటిష్టంచేశారు. గతంకంటె పెంచారు. తత్ఫలితంగా అత్యధికులైన ముస్లిం కౌలుదార్ల (కనందార్ల), రైతుల (వెరుంపట్టం దార్ల) స్థానం మరింత క్షీణించింది." (సుమిత్ సర్కార్, మాడర్న్ ఇండియా, మాక్మిలన్, 1983). మలబార్‌లో బ్రిటిష్ పాలకులు పూర్తిగా రైత్వారీ విధానాన్ని కూడ ప్రవేశ పెట్టలేదు. భూ అధికారాన్ని పూర్తిగా జెన్మిలో కేంద్రీకరించారు. జెన్మిలను స్వతంత్ర యజమానులుగా గుర్తించారు బీడు భూములతో సహా భూమి అంతటి పైనా భూస్వామికి స్వతంత్ర అధికారం ఇచ్చి శిస్తువసూళ్ళలో ప్రభుత్వానికి అతణ్ని జవాబుదారీ చేశారు. దీనితో జెన్మియద్దేచ్ఛగా కౌళ్ళకు ఇచ్చుకునే పద్ధతి వచ్చింది. కనందార్ సాంఘికంగా అనుభవిస్తుండిన మధ్య వర్తిస్థానం నుంచి వాస్తవంగా భూస్వామికీ, రైతుకూ మధ్య కౌలుదారు స్థానం ఎత్తవలసి వచ్చింది. జెన్మికి తోచినంత శిస్తువసూలు చేసుకునే అధికారం వచ్చింది. కౌలురేటు పెంచడం, కౌలుదారును తొలగించడం, కౌలును పునరుద్ధరించేటప్పుడు చెల్లించాల్సిన రుసుమును ఏకపక్షంగా నిర్ణయించడం, చివరకు భూమి అమ్మకంతో సహా భూమిమీద సమస్త హక్కులూ జెన్మికి సంక్రమించాయి. అప్పటివరకూ సాంఘిక పాలకవర్గంగా ఉన్న జెన్మిని బ్రిటిష్ పాలకులు కౌలు అనుభవించే పరాన్న భుక్కు వర్గంగా, పూర్తిస్థాయి భూస్వామిగా మార్చివేశారు. సహజంగానే ఇక ఈ వర్గం కౌలుదార్ల మూల్గులు పీల్చడం ప్రారంభించింది.

జెన్మిల దారుణ దోపిడీని ప్రతిఘటిస్తూ మోప్లాలు 1830 ల నుంచే చెదురు మదురుగా, అసంకల్పితంగా తిరుగబడడం మొదలుపెట్టారు. మద్రాసు ప్రభుత్వం 1851లో నియమించిన కమిషన్ ముందు మోప్లాలు తమ తిరుగుబాట్లకు కారణం పేదరికం, అణచివేత, హిందూ భూస్వాముల దోపిడీ అని చెప్పారు. అయినా ఈ కమిషన్ మోప్లారైతులకూ, హిందూ జెన్మిలకూ జరిగిన ఈ ఘర్షణలను మత కల్లోలాలుగానే చిత్రించింది. 1836 నుంచి 1898 వరకు ఎరనాడు, వల్లువనాడు, పొన్నాని తాలూకాల్లో నమోదయిన 45 క్రిమినలు కేసులను బ్రిటిష్ ప్రభుత్వం

"మోప్లా అల్లర్లు" అనే పేరిట ముస్లింల దౌర్జన్య చర్యలుగా ప్రచారం చేసింది ఈ తిరుగుబాట్లు మతోన్మాద పూరితాలు కాదని చూపుతూ కె ఎన్ పణిక్కర్ 1851 ఆగస్ట్ 22న జరిగిన ఒక ఉదంతాన్ని వివరించాడు.

ఆరోజు ఆరుగురు మోప్లాలు వల్లువనాడు రాజా గుమస్తా, స్వయంగా భూస్వామీ అయిన కొట్టుపరంపత్ కోముమీనన్‌ను చంపేశారు. అక్కడినుంచి రెండు మైళ్ళ దూరంలో ఉన్న ఇత్తున్ని రాముమీనన్ అనే భూస్వామి ఇంటికి వెళ్ళి అతణ్నీ, అతని దగ్గరే ఉన్న కడక్కతిల్ నంబూద్రి అనే బ్రాహ్మణ భూస్వామినీ చంపేశారు. అప్పటికి 19 మంది అయిన మోప్లాలు అక్కడినుంచి 13 మైళ్ళ దూరం వెళ్ళి ఆ ప్రాంత ప్రధాన భూస్వామి అయిన కొలతూర్ వారియర్‌ను చంపేశారు ఈ మోప్లాలు మతోన్మాదులు అయి ఉండరనడానికి పణిక్కర్ మూడు కారణాలు చూపుతాడు. ఒకటి- వాళ్ళు కుటుంబ పెద్దను మాత్రమే చంపారుగాని, ఎక్కడా మరొక కుటుంబ సభ్యుని ఒంటిమీద చెయ్యి వెయ్యలేదు. రెండు, అన్నిచోట్లా వాళ్ల తప్పని సరిగా ఖాతా పుస్తకాలూ, కాయిదాలూ తగులబెట్టారు. మూడు, ఈ 19 మందీ "ముస్లిం మతోన్మాదులు" హిందువులనే చంపదలచుకుంటే ఒక హిందూ ప్రాంతంలో 15 మైళ్ళు నడిచి నలుగురు సంపన్న హిందువులను మాత్రమే చంపనవసరం లేదు (కెఎన్ పణిక్కర్, పెజంట్ రివోల్ట్స్ ఇన్ మలబార్.... —ఎఆర్ దేశాయి, పెజంట్ స్ట్రగుల్స్ ఇన్ ఇండియా'లో ఒయుపి' 1981)

కాని వాస్తవమైన వ్యవసాయిక ఘర్షణను వక్రీకరించదలచిన బ్రిటిష్‌ప్రభుత్వం మతోన్మాదాన్ని అణచే పేరుమీద నిర్బంధచర్యలకే తలపడిందిగాని సమస్యమూలాన్ని గమనించి పరిష్కరించబూనుకోలేదు, 'మోప్లా అల్లర్ల చట్టం', 'మోప్లా యుద్ధపు కత్తులచట్టం' వంటి నల్లచట్టాలను అమలులోకి తెచ్చింది. ఈ రెండో చట్టంప్రకారం ఇంట్లో ఇంటి అవసరాలకోసం ఉండే కమ్మ కత్తి ఉండడం కూడా నేరమైపోయింది.

మోప్లాలస్థితి ఇలా ఉండగా, జెన్మి అధికారాలు కోరలు చాచడంతో కనందార్ల పరిస్థితి కూడ అస్థిరం కావడం మొదలైంది. జెన్మిలు బ్రిటిష్ పాలకుల తోడ్పాటుతో కౌలు నిబంధనలను మరింత కట్టుదిట్టం చేసి కనందార్లలో సంపన్న, పేద తరగతుల మధ్య విభజనను మరింత పెంచారు. సరిగ్గా ఇదే సమయంలో కేరళ రాజకీయరంగంలోకి కాంగ్రెస్ ప్రవేశించింది. అధికారంనుంచి తరిమేయబడ్డ కింది తరగతి కనందార్లు కాంగ్రెస్‌కు పట్టుగొమ్మ అయ్యారు. సహాయ నిరాకరణ ఉద్యమం జెన్మిలను,

సంపన్న కనందార్లనూ మినహాయించి మిగిలినవారందరి ఆకాంక్షలనూ ఆవిష్కరించింది. మరోవైపు ఖిలాఫత్ ఉద్యమం ముస్లింలయిన మోప్లాల ఉద్యమానికి కొత్తలో ఊపునిచ్చింది. మిగిలిన వర్గాలు సహాయ నిరాకరణోద్యమంలో వెనుకడుగువేయగా మోప్లా తిరుగుబాటు 1921 ఆగస్టులో వెల్లువలాగ పెల్లుబికి ఒక కొత్త అధ్యాయాన్ని సృష్టించింది.

ఆగస్ట్ 19న సైన్యం, పోలీసులు మోప్లాల నాయకుల్ని ఆరెస్టు చేయడానికి తిరురంగడి బయల్దేరారు. మంబ్రాత్ మసీదు అధిపతి, ఉద్యమ నాయకుడు, గౌరవనీయుడూ అయిన అలీ ముసలియార్‌ను కూడ వాళ్లు ఆరెస్టు చేయబోతున్నారని తెలిసింది. 20 ఉదయాన వాళ్లు కిజక్కేపల్లి చేరి అక్కడి మసీదు సోదాచేసి, అంత ప్రముఖులు కాని ముగ్గురు ఖిలాఫత్ వలంటీర్లను ఆరెస్టుచేశారు. ఈ వార్త తెలిసి పరుగెత్తుకొచ్చిన మోప్లాలమీద పోలీసులు కాల్పులు జరిపి అనేకమంది ప్రాణాలు బలిగొన్నారు. రెచ్చిపోయిన మోప్లాలు సైన్యంమీద, పోలీసులమీద విరుచుకుపడ్డారు ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేసారు. ట్రెజరీ దోచుకొని కాయిదాలు తగులబెట్టారు. ఈ విప్లవజ్వాల త్వరలోనే ఎరనాడు, వల్లువనాడు, పొన్నాని తాలూకాలకు వ్యాపించింది. ఈ తిరుగుబాటు మొదటిదశ ఖచ్చితంగా ట్రెజరీలకు, కచేరీలకు, పోలీసు స్టేషన్లకు తదితర బ్రిటిష్ అధికార చిహ్నాలకు' హిందూ భూస్వాములకు వ్యతిరేకంగానే ఎక్కుపెట్టబడింది.

ఈ తిరుగుబాటుకు ముఖ్య నాయకులు వరియంకున్నాత్ కున్హమ్మద్‌హాజీ, కలతింగల్ మమ్మద్, అలీ ముసలియార్, సీతికోయాతంగల్, ఎంచిచికోమాతంగల్ ఎరనాడు తాలూకాలో ఈ నాయకులు 'రిపబ్లిక్'లు స్థాపించారు. కున్హమ్మద్ హాజీ, మమ్మద్ రిపబ్లిక్ అధ్యక్షులయ్యారు. సైన్యాలు రూపొందించారు. పోలీసు వ్యవస్థను ఏర్పరచారు. నేరస్తులను విచారించడానికి కోర్టులు ఏర్పరిచారు. కున్హమ్మద్‌హాజీ తన రిపబ్లిక్‌బ్రిటిష్ అధికారం నుంచి విముక్తి అయిందని ప్రకటించాడు. ఒక ఏడాదిపాటు పన్నులన్నీ రద్దుచేశాడు. రిపబ్లిక్ నుంచి బైటికి వెళ్ళే వాళ్ళకు పాస్‌పోర్టులు ఇచ్చే ఏర్పాటు చేశాడు. భూస్వాముల వరిపొలాలన్నిటినీ కోసుకొమ్మని రైతులను ఆదేశించాడు.

సీతి కోయా తంగల్ వల్లువనాడు ఖిలాఫత్ రాష్ట్రానికి 'గవర్నర్' అయ్యాడు. ఇప్పుడీకరాజ్యం ప్రజలందరిదీనని, ఎవరూ హింసాచర్యలకు పాల్పడవద్దని కోరుతూ

ధర్మాదేశం జారీచేశాడు. పల్లువనాడు తాలూకాలో ఎంబిచికోయాతంగల్ నేరస్తుల్ని విచారించడానికి కోర్టుల ఏర్పరిచాడు. మొత్తంమీద ఎరనాడు, వల్లువనాడు తాలూకాల్లో బ్రిటిష్ అధికారం బద్దలయిపోంది. పాల్ఘాట్ తాలూకా తప్ప దక్షిణ మలబార్ అంతా తిరుగుబాటుదారుల చేతుల్లోకి వెళ్ళిపోయిందని మద్రాస్ రాష్ట్ర ప్రభుత్వ ప్రధానకార్యదర్శి రాశాడు. ఈ ప్రాంతం మీద తిరుగుబాటుదార్లు తమ అధికారాన్ని ఆరునెలల పాటు నిలుపుకోగలిగారు. సైన్యాన్నీ, తమను అణచడానికి ప్రత్యేకంగా ఏర్పాటయిన మలబార్ పోలీసులనూ ఎదిరించి తిరుగుబాటుదార్లు పోరాడారు. ఒక బ్రిటిష్ సైనికాధికారి మాటల్లో "ప్రస్తుత పరిస్థితి స్పష్టంగా యుద్ధంలాగానే ఉంది. మోప్లా ప్రతిఘటన గెరిల్లా యుద్ధ తంత్రంమీద ఆధారపడింది ...బలపడుతోంది. సాయుధ తిరుగుబాటు దళాలు దాదాపు 10,000 మందిని కలిగి ఉంటాయి."

ఐతే ఈ తిరుగుబాటును అతి కొద్ది మంది కాంగ్రెస్ నాయకులు మినహా మిగతా హిందువులంతా ఖండించారు. హిందువులు బ్రిటిష్ సైన్యాలకు తోడ్పడ్డారు. మోప్లాలకు హిందువులపట్ల అనుమానం పెరిగి, తిరుగుబాటు రెండోదశలో కొన్ని చోట్ల మత ఘర్షణలకు దారితీసింది. కాని, ఏదేమైనా, ఈ తిరుగుబాటు రెండో దశలో కూడ మత ఘర్షణది పైచేయి కాలేదనే చరిత్రకారులందరూ సకారణంగా రుజువు చేశారు.

మొత్తంమీద తిరుగుబాటు ఓడిపోక తప్పలేదు. తిరుగుబాటులో పాల్గొన్న వర్గాలను విశ్లేశిస్తూ ఇఎంఎస్ నంబూదిరిపాద్ 1943లో "....బ్రిటిష్ మలబార్‌లో మహత్తర ప్రజా ఉద్యమం అత్యంత విషాదకరమైన, అత్యంత విఫలమైన ప్రజా చర్యగా పక్కదారి పట్టింది.... ఈ మొత్తం విషాదం వెనుక ఉన్న మలబార్, భారత కేంద్ర రాజకీయ నాయకత్వపు దారుణ అజ్ఞానాన్ని చూడాలి. తాము రేకెత్తించిన ప్రజాశక్తుల వాస్తవశక్తి ఏమిటో వాళ్ళు అర్థంచేసుకోలేకపోయారు. నాయకులకు తాము కోరుకున్న అనుచరులకంటె చాల భిన్నమైన అనుచరులు దొరికారు. ఐనా తాము కోరుకున్నది ఈ అనుచరులనేనని వాళ్ళనుకున్నారు. ప్రజలకు వాళ్ళు కోరుకున్న నాయకులు దొరకలేదు, కాని దొరికిన నాయకులనే తాము కోరుకున్నామనివాళ్లనుకున్నారు. నాయకత్వం సర్వశక్తిమంతం కాదనీ, ప్రజలు గొర్రెల మంద లాంటి వాళ్ళు కాదనీ నేర్చుకోడానికి దక్షిణ మలబార్ రక్తసిక్తమార్గాన్ని అవలంబించ వలసి వచ్చింది. ఒక దశాబ్దంపాటు పౌరహక్కులన్నీ అణగిపోయిన వాతావరణంలో ఉండవలసి వచ్చింది. వేల ప్రాణాలు బలిపెట్టవలసి వచ్చింది. ఎంతోమంది చెప్పరాని

బాధలకు గురి కావలసి వచ్చింది. దీనికంతా కారణం ప్రజలకు తమదంటూ ఒక స్వంత నిర్మాణం ఏర్పడింది, కాని ఒక భిన్నమైన నాయకత్వం వారినినడిపించింది" అని రాశాడు.

మొత్తంమీద 1921 తిరుగుబాటులో 2337 మంది మోప్లాలు చంపేయబడ్డారనీ, 1652 మంది గాయపడ్డారనీ, 45404 మంది అరెస్టు చేయబడ్డారనీ ప్రభుత్వలెక్కలే తెలుపుతున్నాయి.

నిర్బంధంతర్వాత ప్రభుత్వం 'అభ్యుదయ' చర్యలు ప్రారంభించింది. 1930లో మలబార్ కౌల్దారీ చట్టం అమలులో కొచ్చింది. అర్థశతాబ్దంగా కనందార్ ఏకోర్కెల కోసం పోరాడుతున్నాడో ఆ కోర్కెలన్నీ ఆమోదించబడ్డాయి. ఇక ఈ మధ్య తర గతిని కొనివేయడానికి ఎన్నెన్నో సాంఘిక సంస్కరణలు వచ్చిపడ్డాయి. మద్రాస్ మరుమక్కతాయం చట్టం మలబార్‌లోని మాతృస్వామిక వారసత్వ హక్కును అన్ని కులాలకూ వర్తింపజేసింది. నంబూద్రి చట్టం ఉమ్మడి కుటుంబాల పంపకాన్ని సులభతరం చేసింది. స్త్రీలకు ఆస్తిహక్కును కల్పించి, బహు భార్యాత్వాన్ని రద్దు చేసి నంబూద్రి స్త్రీల స్థానాన్ని అభివృద్ధి చేసింది. 1930 కౌల్దారీ చట్టంలో వెరుం పట్టందార్లకు కూడ కొన్ని నామమాత్రపు హక్కులుచేర్చారు వెరుంపట్టందారు ఒప్పం దాన్ని స్థిరీకరించాలని, కౌలురేటును న్యాయబద్ధం చేయాలనీ చట్టం కాయిదం మీద రాసింది. కాని ఆ చట్టమే కౌళ్ళమీద విధించిన మరికొన్ని నిబంధనల వల్ల వెరుం పట్టందార్లకు ఇసుమంత కూడ లాభం కలగలేదు.

ఈ పరిణామాల ఫలితంగా 1930ల తర్వాత కాలంలో మలబార్ వ్యవసాయ రంగం ప్రధానంగా రెండువర్గాల కింద చీలిపోయింది. వాస్తవంగా సాగుదార్లయిన వెరుంపట్టందార్లు, కూలీలు ఒక వైపు. సాగుచేయకుండా భూ యాజమాన్యం గల జెన్మీలు, కనందార్లు, తదితరులు మరోవైపు చేరారు. సాగుదార్లయిన వెరుంపట్టందార్లు కూలీలు సంఘటితం కావడం మొదలెట్టారు. 1930 చట్టం వరకు వెరుంపట్టందార్లతో కలిసి జెన్మీలకు వ్యతిరేకంగా పోరాడిన కనందార్, చట్టం తర్వాత జెన్మీలతో కలిసి వెరుంపట్టందార్లకు వ్యతిరేకంగా పోరాడ్డం మొదలు పెట్టాడు. ఇక వెరుంపట్టందార్ కనందార్ నాయకత్వంలో పోరాడే అనుచరుడుగా కాక తానే స్వయంగా పోరాడవల సిన వాడయ్యాడు. ఇక్కడ వ్యవసాయరంగంలోని పరిణామాలు జాతీయ అంతర్జా తీయ స్థాయిలో మరింత విస్తృత పరిణామాలతో కలగలసి సాగాయి. ఆకటి దశా

ద్ధం అప్పుడే ప్రవేశిస్తున్నది. ఆర్థిక సంక్షోభం ఫలితంగా అన్నివర్గాల ప్రజల బతుకులూ ఒడిదుడుకులకు లోనయ్యాయి' ఈ సంక్షోభంలోనుంచి దేశవ్యాప్తంగా ఒక నూతన చైతన్యం, ఒక విప్లవ వాతావరణం విస్ఫోటనం కాబోతున్నది. మలబార్ లోని క్రియాశీల శక్తులు తమ ఆకాంక్షలను కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ (సిఎస్‌పి) లో ఆవిష్కరించుకున్నాయి. ఈ క్రియాశీల శక్తుల పునాది గ్రామీణ మధ్య తరగతిలో ఉంది కనుక మలబార్ సిఎస్‌పి ప్రధానంగా వ్యవసాయ సమస్యల మీదనే తన దృష్టి కేంద్రీకరించింది.

1930-32ల నాటి శాసనోల్లంఘనవంటి జాతీయోద్యమాలు మలబార్‌లో అత్యంత క్రియాశీలంగా నిర్వహించబడ్డాయి, ఈ ప్రజ్వలనను ముందే ఊహించిన కేంద్ర నాయకత్వం మోప్లా తిరుగుబాటు పునరావృతమవుతుందనే భయంతో దక్షిణ మలబార్‌లో ఏ కార్యక్రమమూ తీసుకోవద్దనీ, ఉత్తర మలబార్‌కు వెళ్ళమనీ కార్యకర్తలను ఆదేశించింది. ఇది మరోరకంగా ఉద్యమానికి ప్రయోజన కరమేఅయింది, ఉత్తర మలబార్ కూడ పోరాటపథం చేపట్టింది. పయనూర్ ఉప్పు సత్యాగ్రహం, హోసదుర్గ తాలూకా అడవి సత్యాగ్రహం కన్ననూర్ యువజనసమావేశం ఉత్తరమలబార్‌లో కొలిమిని రాజబెట్టాయి.

ఆర్థిక సంక్షోభం అన్ని వర్గాల ప్రజల అసంతృప్తి రగిలించిందనడానికి సూచికగా జెన్మిలు, కనందార్లు భూమిశిస్తు తగ్గింపు ఆందోళనను మొదలుపెట్టారు. కొందరు కాంగ్రెస్ నాయకులు స్వార్థపూరితంగా ప్రారంభించిన ఈ ఆందోళనను సిఎస్‌పి నాయకులు తమ అధీనంలోకి తెచ్చుకుని, రుణాలరద్దు కౌలుతగ్గింపు వంటి డిమాండ్లు కూడ కలిపి, దాన్ని విస్తృత ప్రజా ఉద్యమంగా మలిచారు. ప్రజా ఉద్యమంగా పెరుంపట్టందార్ల ఉద్యమంగా తయారయిన ఈ ఉద్యమం పేద కనందార్లను కూడ మిత్రులుగానే పరిగణించి తనలో చేర్చుకుంది. కనంభూముల మీద కొన్ని సంవత్సరాలకోసారి చెల్లించాల్సిన పునరుద్ధరణ రుసుము తగ్గించాలనీ, ఏ నిబంధనకిందనైనా కౌలుదారును బేదఖలు చేయించే అధికారం జెన్మికి ఉండగూడదనీ, పెరుంపట్టందార్లు సాలుసరి కౌలును ముందే ధరావత్తుగా చెల్లించాలనే నిబంధన రద్దుచేయాలనీ, కౌలు రేటును న్యాయంగా నిర్ణయించాలనే డిమాండ్లతో కొత్త ప్రజా ఉద్యమం ప్రారంభమైంది. సాగుదార్లయిన కౌలుదార్లందరి ప్రయోజనాలనూ నెరవేర్చే ఈ డిమాండ్ల ఫలితంగా ఈ ఉద్యమం జెన్మిలనూ, సంపన్న కనందార్లనూ ఒంటరులను చేసి వారికి

బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమం ప్రారంభించింది. కేరళ కాంగ్రెస్ కమిటీలో సిఎస్‌పికి చెందిన సోషలిస్టుల ప్రాబల్యం ఉండడంవల్ల ఈ ఉద్యమానికి అధికారికంగా 'పైనుంచి' నాయకత్వంకూడ అమరింది. ఈ ఉద్యమ ఫలితంగానే 1937 ఎన్నికల్లో అధికారానికొచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం తన పార్టీయే అంతకు ముందు చేసిన డిమాండ్లను తుంగలో తొక్కుతూ ఒక బిల్లు ప్రవేశపెట్టింది. మలబార్ రైతులంతా ముక్తకంఠంతో ఖండించగా, తాలూకా రైతు సంఘాలు చేసిన ఉధృత ప్రచారంతో, ఆందోళనతో ప్రభుత్వం దిగివచ్చి ఆ బిల్లును ఉపసంహరించుకుంది.

తమ న్యాయమైన కోర్కెలను ప్రభుత్వం దృష్టికి తెచ్చేందుకూ, మలబార్ రైతాంగంలో సంఘచైతన్యాన్ని ఇనుమడింపజేసేందుకూ అఖిల మలబార్ రైతుసంఘం డిసెంబర్ 38లో జిల్లావ్యాప్తంగా ఊరేగింపులకు పిలుపిచ్చింది. అంతవరకూ సోషలిస్టులు తాలూకా స్థాయిలో ఏర్పరిచి సమన్వయపరుస్తున్న రైతుసంఘాలు 1938 మేలో అఖిల మలబార్ రైతుసంఘంగా కేంద్రీకృత నిర్మాణ రూపాన్ని పొందాయి. ఈ నిర్మాణం కింద డిసెంబర్‌లో సాగిన ఊరేగింపులు మలబార్‌ను మేల్కొలిపాయి జిల్లావ్యాప్తంగా పొలాలు మేల్కొంటున్నచప్పుడు విని కాంగ్రెస్ ప్రభుత్వం ఒక కౌల్దారీ సంస్కరణ సలహా కమిటీని నియమించింది. ఆ కమిటీ సూచనలు జెన్మిల కనందార్ల ప్రయోజనాలకే అనుకూలంగా వెలువడ్డాయి. ఆ కమిటీ పని సాగుతుండగానే వచ్చిన రెండో ప్రపంచయుద్ధం మలబార్ రైతులను మరింత ఉన్నతమైన రాజకీయ పోరాటాలలోకి పంపింది. 1937 నుంచే కమ్యూనిస్టుల ప్రాబల్యంలోకివచ్చిన రైతుసంఘ నాయకులు, సిఎస్‌పి కార్యకర్తలు రైతుసంఘపు వ్యవసాయ సంస్కరణల డిమాండ్లను రాజకీయ డిమాండ్లుగా మార్చారు రైతుసంఘం యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు, సదస్సులు, ఊరేగింపులు నిర్వహించడం ప్రారంభించింది. దీనితో ప్రభుత్వ దమనకాండ రైతుసంఘం మీద పెరిగిపోయింది. 1940 మే నుంచి ప్రభుత్వం ఎందరో రైతుసంఘ నాయకుల్ని అరెస్టు చేసింది. ఇళ్ళు సోదా చేసింది, సాహిత్యం ఎత్తుకు పోయింది. ఈ నిర్బంధకాండ ఫలితంగా అనేక మంది నాయకులు రహస్య జీవితానికి వెళ్ళవలసి వచ్చింది. రైతుసంఘం యుద్ధ వ్యతిరేక కార్యక్రమాన్ని ప్రత్యక్షంగా కాక పరోక్షంగా నిర్వహించడం మొదలు పెట్టింది. యుద్ధం వల్ల కలిగే ఆర్థిక దుష్ఫలితాల నుంచి ప్రజల్ని రక్షించడానికి ప్రభుత్వం వెంటనే తగిన చర్యలు చేపట్టాలనే డిమాండ్‌తో ప్రజా ఉద్యమం కొత్త రూపెత్తింది. ఈ

ఉద్యమంలో భాగంగా మలబార్ అంతటా అనేక బహిరంగ సభలు నిర్వహించారు. రైతు సంఘాల సభ్యత్వం విపరీతంగా పెరిగిపోయింది. ఈదశలో ఉద్యమాన్ని సమీక్షించుకోవడానికి 1940 సెప్టెంబర్ 15న చిరక్కల్ తాలూకా కీచెరి గ్రామంలో తాలూకా రైతుసంఘ సమావేశం జరపాలని నిర్ణయించుకున్నారు, అదే సమయంలో సరిగ్గా అదేరోజు బ్రిటిష్ ప్రతిపాదనల నిరసనదినం జరపాలని కాంగ్రెస్ పిలుపు ఇచ్చింది. కాంగ్రెస్ పిలుపు ఫలితంగా మలబార్ జిల్లా మెజిస్ట్రేటు జిల్లా అంతటా 144 సెక్షన్ విధించాడు. 144 సెక్షన్‌ను ధిక్కరించవద్దని వెంటనే కాంగ్రెస్ ఆదేశించింది కీచెరిలో అంతకు ముందే సమావేశం ఏర్పాట్లు జరిగి ఉన్నందువల్ల ప్రజలు కీచెరి చేరుకున్నారు. 144 సెక్షన్ ఫలితంగా సభానిర్వాహకులు సభాస్థలాన్ని కీచెరినుంచి మొరళకు మార్చారు. అధికారులు అక్కడ కూడ సభను నిషేధించారు. కాని అక్కడ చేరిన 2000 మంది ప్రజలు ఉత్తర్వును ధిక్కరించి సభను జరుపుకో నిశ్చయించారు. అప్పుడు జరిగిన ఘర్షణలో ఒక ఇనస్పెక్టర్, ఇద్దరు కానిస్టేబుళ్లు చనిపోయారు కొట్టాయం తాలూకా మట్టనూరులో ఉత్తర్వును ధిక్కరించినందుకు జరిగిన ఘర్షణలో ఒక కానిస్టేబుల్ మరణించాడు. కొట్టాయం తాలూకా తెలిచేరిలో జరిగిన ఘర్షణలో ఇద్దరు రైతుసంఘ కార్యకర్తలు కాల్చేయబడ్డారు,

ఈ ఘటనల తర్వాత మలబార్ రైతాంగంమీద అమానుష నిర్బంధం మొదలైంది. మలబార్ పోలీసులను గొలుసులు విప్పి ప్రజల మీదికి వదిలారు. ఎంతెంత దారుణాలు చేసినా అడిగేవాడు లేడని మలబార్ పోలీసులను ఉసిగొల్పారు. చిరక్కల్ కొట్టాయం తాలూకాల్లో భయోత్పాతం అమలయింది ఈభయోత్పాతం మధ్యనుంచే పాశవిక నిర్బంధం మధ్య నుంచే రైతాంగం తమ సంఘటిత చర్యలను రహస్యంగా సాగించడం నేర్చుకున్నారు. పోరాట పటిమను విడనాడకుండా సంఘ నాయకత్వాన్ని పోలీసుల కన్నుగప్పి భద్రంగా కాపాడుకున్నారు. ఈ పోలీసుల సాయంతో జెన్మీలు మళ్ళీ కోరలు చాచారు. 38,39,40 ల్లో రైతుసంఘాల ప్రాబల్యం వల్ల అణగివున్న జెన్మీలందరూ రైతాంగం మీద మరింత కసితో అణచివేతకు సిద్ధపడ్డారు.

ఈ పూర్వరంగంలో ఆవిర్భవించినదే కయ్యూరు రైతాంగ పోరాటం. ఈ చరిత్రకంతా, మలబార్ రైతాంగ పోరాట సాంప్రదాయానికంతా సహజ పరిణామమే, ఫలితమే కయ్యూరు రైతుల పోరాటం. శతాబ్దంపైగా పోరాడుతున్న తమ సోదరుల దీక్షలోంచి, భూస్వామ్యానికీ, ప్రభుత్వ యంత్రాంగానికీ వ్యతిరేకంగా పిడుగులాగా

విరుచుకుపడే మలబార్ రైతాంగ స్వభావం లోంచి, రాజ్యాంగయంత్రం పట్ల కసిని గూడ అప్పటికప్పుడే అక్కడికక్కడే తీర్చుకునే మలబార్ రైతాంగ చైతన్యంలోంచి కయ్యూరు రైతాంగ పోరాటం రూపుదిద్దుకుంది.

కయ్యూరు అప్పటికి దక్షిణ కనరా జిల్లాలోని కాసరగోడు తాలూకా, హోసదుర్గ ఫిర్కాలో ఒక గ్రామం. సాంస్కృతికంగా మలబార్‌లో కలసి వెలసిన ఈ తాలూకా బ్రిటిష్ పాలకుల కుటిల నీతివల్ల దక్షిణ కనరా జిల్లాలో కలిసింది. మలబార్‌తో సాంస్కృతిక బంధం బలవంతాన తెంచబడ్డ ఈ తాలూకా మరింత ఎక్కువగా మలబార్‌తో అనుబంధాన్ని పెంచుకుంది. మలబార్ పరిణామాలపట్ల ఆసక్తి చూపింది. పొరుగున ఉన్న చిరక్కల్ తాలూకా ప్రభావం కాసరగోడు తాలూకా మీద సాధారణంగా, హోసదుర్గ ఫిర్కా మీద ప్రధానంగా వ్యాపించింది. 1937-38 ల్లో మలబార్‌లో రైతుయాత్రలు జరుగుతున్న సందర్భంలో హోసదుర్గ ఫిర్కా రైతులు కూడా జిల్లా కేంద్రం మంగళూరుకు ఊరేగింపుగా వెళ్లారు.

మలబార్ జిల్లాలో భాగం కానందువల్ల హోసదుర్గ ఫిర్కాకు కౌల్దారీ చట్టం అమలు కాలేదు. కర్ణాటకలో ఉన్న రైత్వారీ పద్ధతి కూడ అమల్లో లేక హోసదుర్గ ఫిర్కా రెంటికీ చెడ్డ రేవడై భయంకరమైన జెన్మి పద్ధతి కింద నలిగిపోయింది. అంతేగాక పాలనాపరంగా రైత్వారీ ప్రాంతమైన ఈ ఫిర్కాలో జెన్మి భూస్వామిగా కాక రైతుగా గుర్తించబడ్డాడు. వాస్తవానికి గ్రామంలోని భూమినంతా తనగుప్పెట్లో పెట్టుకుని సాగుచేయకుండా ఫలితం అనుభవించే జెన్మి సాగుచేసే రైతులాగ ప్రభుత్వ కాగితాలకెక్కాడు. అంటే 1940ల నాటి హోసదుర్గ ఫిర్కా 30 లకు ముందు మలబార్ ఎలా వుండేదో అలా ఉండేదన్న మాట.

ఈ పరిస్థితిలో మలబార్ కౌల్దారీ చట్టాన్ని హోసదుర్గ ఫిర్కాకు కూడా వర్తింపజేయాలనే డిమాండ్‌తో స్థానిక రైతుసంఘం ఆందోళన ప్రారంభించింది. 1938, 39 ల్లో ఈ డిమాండ్ ఆధారంగా రైతుసంఘం, కాంగ్రెస్ ఈ ప్రాంత రైతాంగాన్ని సంఘటితపరచడం మొదలుపెట్టాయి. ఈ ప్రాంతపు జెన్మిలకు చట్టం ప్రకారం సర్వాధికారాలూ సంక్రమించినప్పటికీ రైతాంగ ఉద్యమం వారిని లొంగదీసి మలబార్ కౌలుదార్లు, రైతులు పొందుతున్న రాయితీలు సాధించుకుంది. 1940 సెప్టెంబర్ 15 తర్వాత మలబార్ అంతటా సాగిన దమనకాండలో భాగంగా ఇక్కడి జెన్మిలు కూడ గత రెండేళ్ళుగా తాము కోల్పోయినవి సాధించుకోవడానికి ప్రయత్నించారు. పాత

కౌలుదార్లను తొలగించి, కొత్త కౌలుదార్లను నియమించామనే సాకు చూపి పాత కౌలుదార్లు వేసిన పంటలు కోసుకుపోవడానికి ప్రయత్నించారు. రైతుసంఘాలు ఈ భూస్వాముల దౌర్జన్యాన్ని ప్రతిఘటించడానికి నిశ్చయించాయి. రైతుసంఘం ఒక వలంటీరు దళాన్ని ఏర్పాటుచేసి భూస్వాములు పంటలు కోసుకుపోకుండా ప్రతిఘటించింది. ఎక్కడైనా జెన్మి గూండాలు పంట కోసుకుపోవడానికి వచ్చారని తెలియగానే వలంటీర్ దళం వెళ్ళి వాళ్ళను అడ్డగించి రైతులు పంట కోసుకుపోవడానికి రక్షణగా నిలబడేది. ఈ ప్రతిఘటనలూ, పంటకోతలూ 1941 ఫిబ్రవరిలో జరిగాయి. ఎక్కడా రైతుల ప్రతిఘటనముందు నిలవలేకపోయిన జెన్మీలు అవమానంతో రైతులమీద విరుచుకుపడ్డారు. పోలీసులు ఊళ్ళమీద పడి రైతులనూ, నాయకులనూ అరెస్టుచేశారు. హింసించారు. వాలంటీర్ల సహాయంతో పంటకోసుకున్నదెవరని ప్రశ్నిస్తూ రైతులను వేధించడం మొదలుపెట్టారు. మార్చి అంతా సాగిన ఈనిర్బంధకాండలో మూడోవారంలో ఒకరోజు పోలీసులు కయ్యూరు మీద దాడి చేశారు. ప్రజలను హింసించారు. ఒక వలంటీరును పట్టుకుని చిత్రహింసలు పెట్టారు.

ఈ మొత్తం నిర్బంధానికీ, ప్రత్యేకించి కయ్యూరులోజరిగిన దమనకాండకూ నిరసనగా మార్చి 28న కయ్యూరులో ఒకసభ జరపాలని రైతుసంఘం నిర్ణయించింది. 200-250 మంది రైతులు, వలంటీర్లు సభాస్థలానికి ఊరేగింపుగా తరలివస్తున్నారు. ఆ ఊరేగింపుకు ఒక పోలీసు ఎదురు వచ్చాడు. ఆ పోలీసు కయ్యూరు మీద ఇదివరకెన్నోసార్లు పడి, తమను హింసించినవాడేనని ప్రజలు గుర్తుపట్టారు. క్రోధోద్రిక్తులైన ప్రజలు ఆ పోలీసువైపు పరుగెత్తారు, వారితో తగువు తెచ్చుకొని కష్టాల్లో పడేకన్న, వారిని అనుసరించడమే ఉత్తమమని ఆ పోలీసుకూడ నినాదాలిస్తూ ఊరేగింపులో నడిచాడు. కాని కొద్ది నిమిషాల్లోనే, తనమీదనుంచి ప్రజలు దృష్టి తిప్పుకోగానే దొరికిన మొదటి అవకాశంలోనే ఊరేగింపును వదలి పరుగెత్తడం మొదలుపెట్టాడు. అతను ఎందుకు పరుగెత్తుతున్నాడో తెలియని జనం అతని వెంటపడ్డారు. అప్పుడు జరిగిన ఘర్షణలో ఆ పోలీసు చనిపోయాడు.

ఈ సంఘటన తర్వాత ఈ ప్రాంతంలో మలబార్ అప్పటివరకూ కనీవినీ ఎరగనంత భయంకరమైన అణచివేత మొదలయింది. అమలయిన భయ భీతావహం నుంచి తప్పించుకోవడానికి ప్రజలు ఇళ్లూ, వాకిళ్లూ వదలి పొరుగున ఉన్న అడవు

ల్లోకి పారిపోయారు. సాగిన నిర్బంధంలో అరెస్టులూ, చిత్రహింసలు అతి చిన్న హింసలనిపించాయి. ఈ నిర్బంధాన్ని ఉన్నదున్నట్టుగా వార్తలు పంపినందుకు గాంధీవాద పత్రిక మాతృభూమి విలేఖరి కూడా మలబార్ పోలీసు జమేదార్ చేతుల్లో చిత్రహింస లనుభవించాల్సి వచ్చింది. ప్రజలమీద ఇంత ఘోరమైన నిర్బంధం అమలయితే తమకు కొల్ల అందే దిక్కుకూడ ఉండదనే భయంతో చివరికి జెన్మిలు కూడ మలబార్ పోలీసులు వెళ్ళిపోవాలని కోరడం మొదలుపెట్టారు. హోసదుర్గ తాలూకా నుంచి మలబార్ పోలీసును వెంటనే ఉపసంహరించాలనీ, ప్రశాంత పరిస్థితి నెలకొల్పాలని ఎందరో వ్యక్తులూ, ఎన్నో సంస్థలూ డిమాండ్ చేశారు

ఫిర్కాలోని 60 మంది ముఖ్య కార్యకర్తలను అరెస్టుచేసి పోలీసు హత్య కేసులో ఇరికించారు. కొట్టాయం, చిరక్కల్ తాలూకాలలోలాగ హోసదుర్గ తాలూకాలో వెంటనే రహస్యజీవితానికి వెళ్ళిపోగలిగిన యంత్రాంగం లేకపోవడం వల్ల, రైతుల్లో ఉత్సాహాన్ని నింపి, పోరాటపటిమను రేకెత్తించగల శక్తులన్నీ కటకటాల వెనక్కి నెట్టేయబడడంవల్ల ఇక్కడి రైతాంగ ఉద్యమం వెనుకడుగు వేసిందని ఇ.ఎం.ఎస్ నంబూద్రిపాద్ 1943లో రాశాడు. కయ్యూరు ఉదంతాన్ని సాకుగా చూపి ప్రభుత్వం అఖిల మలబార్ రైతుసంఘాన్ని నిషేధించింది.

మంగళూరు కోర్టులో కయ్యూరు పోలీసు హత్యకేసు విచారణ జరిగింది. ఐదుగురికి సెషన్స్‌కోర్టు విధించిన మరణశిక్షను హైకోర్టు ఖాయంచేసింది. గవర్నర్, వైస్‌రాయ్, ప్రివీ కౌన్సిల్ క్షమాభిక్షను నిరాకరించాయి. కయ్యూరు వీరులను విడుదలచేయాలని 1942లో ప్రారంభమైన ఉద్యమం ఉరిశిక్షను రద్దుచేయాలని దేశవ్యాప్త ఉద్యమంగా మారినా 1943 మార్చి 20న ప్రభుత్వం నలుగురిని ఉరితీసి, ఐదో ఖైదీకి మైనారిటీ తీరనందువల్ల యావజ్జీవ శిక్షగా మార్చింది. ఉరిశిక్ష రద్దు ఆందోళనలో మితవాద కాంగ్రెస్ పక్షం వాళ్ళతోసహా అన్నివర్గాల ప్రజలు పాల్గొన్నారు. వారి ప్రాణాలు కాపాడడానికి ఉన్న అవకాశాలన్నీ ప్రయత్నించారు కాని రెండో ప్రపంచ యుద్ధ సంరంభంలో బ్రిటిష్ ప్రభుత్వం కుంజంబునాయర్, అప్పు, చిరకుండన్, అబూబకర్‌లను కన్ననూరు జైలులో ఉరికంబానికి ఎరజేసింది. అట్లా ఈ నలుగురు ఈ దేశపు ప్రజా విముక్తిపోరాటంలో రాలిన వేలాది అమరవీరుల్లో భాగమయ్యారు.

గత పోరాటాలలో అమరులైన వీరులు మన సంస్మరణలో భాగమై సాగుతున్న పోరాటానికి ఉత్తేజాన్నిస్తారు. ఆ అమరయోధుల గాధలు వర్తమాన పోరా

టంలో పాల్గొనేందుకవసరమైన చైతన్యాన్ని ఇనుమడింప జేస్తాయి ఆ అమరుల జీవన్మరణ సంఘర్షణ భవిష్యత్తు పట్ల అద్భుతమైన ఆశను కలిగిస్తుంది. ఈ ఆశా వహ దృష్టిని కలిగించుకునేందుకు ప్రజలు తమ పూర్వ పోరాట యోధుల జ్ఞాపకాలను కేవల జ్ఞాపకాల స్థాయినుంచి కళారూపం స్థాయికి కొనిపోవడం సర్వ సాధారణంగా జరిగే పోరాట కార్యాచరణే అలాంటి ఒక కార్యాచరణగానే, భవిష్యత్ కార్యాచరణకు పురికొల్పే కళారూపంగానే కయ్యూరు వీరుల గాథను నిరంజన 'చిరస్మరణ' రూపంలో మలచారు. ఉత్తేజపూరితంగా, ఉద్వేగభరితంగా, కదిలించి కంట తడి పెట్టించే రీతిలో, కయ్యూరు వీరులు వదిలిపెట్టిపోయిన మహత్తర కర్తవ్యాన్ని కొనసాగించే దీక్షను చదువరిలో కలిగించే పద్ధతిలో నిరంజన ఈ నవలను, ఈ గాథను తయారు చేశారు.

ఈ గాథ గురించి మొట్టమొదట చెప్పవలసింది రచయిత ఎంచుకున్న శిల్పం గురించి నవల మొత్తమూ మనకళ్లముందు ఒక దృశ్య కళారూపంలాగా నడుస్తుంది. గాథలోకి ప్రవేశించడానికి ముందు ఒక కంఠం మనను చల్వత్తూరు రైల్వేస్టేషన్‌నుంచి కయ్యూరుదాకా నడిపించుకుపోయినట్టు, అక్కడ కయ్యూరు వీరుల స్మారకావిష్కరణ సభలో మనం ఈ గాథను వింటున్నట్టు ఒక వాతావరణం సృష్టిస్తుంది. మళ్ళీ అదే కంఠం చివరికి గాథ ముగిసిందని చెప్పి మనకు వీడ్కోలు చెప్తుంది. నాటకంలోనూ, కొన్ని దృశ్యకళారూపాల్లోనూ సూత్రధారి వాతావరణాన్ని సిద్ధంచేసిన తర్వాత దృశ్యరూపం మన కళ్ళముందు కదిలిపోవడానికి ఇది లిఖితరూపం. (అతి కొద్ది చోట్ల ఈ దృశ్య వాతావరణం లోపించినట్టు కనిపించినా అది బహుశా అనువాద లోపమే అయి ఉంటుంది.)

ఈ రచనా పద్ధతి ఫలితంగా పాత్రలూ, వాతావరణమూ చాల సజీవంగా పాఠకుని ఉనికి అంత సజీవంగా, పాఠకుని ముందు తారట్లాడతాయి. రచయితకు ఆ వాతావరణంతో, ఆ పాత్రలతో దగ్గరి పరిచయం ఉండడం వల్ల ఈ సజీవ చిత్రీకరణ అతి ప్రతిభావంతంగా సాగింది. నిరంజన 1938-41 ల్లో కయ్యూరు సమీపంలోని నీలేశ్వరంలో చదువుకున్నారు. హొసదుర్గ, మలబార్ పరిణామాలతో నీలేశ్వరం పాఠశాల విద్యార్థులకు సన్నిహిత సంబంధం ఉంది. ఆ సమయంలో హొసదుర్గ తాలూకాలో పరవళ్లు తొక్కుతున్న రైతాంగ చైతన్యానికి కేంద్రం కయ్యూరే కనుక పరిణామాలు ఆయనకు సన్నిహిత విషయాలే అయ్యాయి తర్వాత పత్రికా

విశేఖరిగా ఆయన కయ్యూరు కేసు విచారణనంతా మంగళూరు కోర్టులో విన్నారు. అప్పటినుంచీ ఈ గాథకు అక్షరరూపం ఇవ్వాలనే ఆలోచనను 14 సంవత్సరాలపాటు మథనపడి చివరికి 1954లో ఆయన నవలను కన్నడంలో పూర్తిచేశారు.

అప్పు, చిరుకండన్‌లు వాళ్ళ మాస్టరు కబురుమీద రహస్యంగా ఏరుదాటి అవతలి పల్లెకు వెళ్ళే సంఘటనతో చిరస్మరణ మొదలవుతుంది. అప్పటికి వాళ్ళిద్దరూ ప్రైమరీ స్కూలు చదువయిపోయి పొలం పనుల్లో ఉన్నారు. వాళ్ళిద్దరిపట్ల మాస్టరుకు గాఢమైన అభిమానం, ఆయన వాళ్ళకు అక్షరాభ్యాసం చేసిన ఉపాధ్యాయుడు మాత్రమే కాదు, వాళ్ళలో పోరాట చైతన్యం రగిలించి, వాళ్ళను పోరుమార్గంలో నడిపిన కామ్రేడ్. నిజానికి కేరళ చరిత్రలో ఈ గ్రామీణ ఉపాధ్యాయులు చేసిన విప్లవ కృషి అపూర్వమైనది. అందుకే ఎ.కె గోపాలన్ తన ఆత్మకథలో "కేరళ ఉపాధ్యాయులు కేరళ చరిత్రను తిరగరాశారు" అన్నాడు. రైతు సంఘం కార్యకలాపాల్లో ముఖ్యపాత్ర వహిస్తూ పోలీసుల కళ్ళలో దుమ్ముకొట్టడానికి హిందీ మాస్టరుగిరీ అభినయించిన మాధవన్‌కు ఈ చిరస్మరణ మాస్టర్ ప్రతీక. ఆయన కయ్యూరును మేల్కొలిపిన నాయకుల్లో ప్రముఖుడు.

మాస్టర్ కబురు మీద వెళుతున్న పిల్లలిద్దరిలో చురుకైనవాడు చిరుకండన్. అప్పు అడిగిన ఒక ప్రశ్నకు చిరుకండన్ మనమూ, శత్రువులూ అని జవాబిస్తాడు. మనుషుల్లో వర్గాల గురించి అప్పటికి ఇద్దరికీ స్పష్టంగా తెలియకపోయినా చిరుకండని జవాబు అప్పులో చాల ఆలోచనల రేపుతుంది. మసక మసకగా మొదలయిన ఈ వర్గ స్పృహ వర్గ చైతన్యంగా మారే క్రమమే, ఆ వర్గ చైతన్యం పరిసరాలలో వర్గ చైతన్యాన్ని ప్రజ్వలింపజేసే వర్గ పోరాట నాయకత్వంగా మారే క్రమమే, ఈ నవల. ఈ క్రమం సరళరేఖ కాదు సరళరేఖ కాదని చూపడమే, జీవితాన్ని దాని శిఖరాలూ లోయలతో చూపడమే ఈ నవల చేసిన పని. "మనం....మన శత్రువులు- ఒకపక్షం దానికి ఎదురుగా మరొక పక్షం ... ఇది స్వారస్యమనిపించింది అప్పుకు. ఒళ్ళుగగుర్పొడిచేలాగ ఉంది ఈ కథనం ఆలోచన.... "అనుకునే అప్పు, "....మన పల్లె. సముద్రతీరం, భారతదేశం, దానికి వెలుపల దూరదూరాన వివిధ దేశాలు.... ఎక్కడెక్కడో సత్య న్యాయాల పక్షం వహించి, వసించే జనం.... నడుస్తున్న చిరుకండడు మౌనంగా ఉన్నా ఒంటరిగా లేడు. అతని లోపల విశాల ప్రపంచంలో ఎంత మంది జనం- ఎంత మంది జనం!...." అనిపించే చిరుకండడు తర్వాత కొన్నాళ్ళకు ఉరికంబం మీదనిలిచి చేయబోయే విజయ నినాదం తొలిపలుకులు అప్పుడే ప్రారంభమయ్యాయి

ఆరోజు పిల్లలిద్దరూ పండితుల ఉపన్యాసం విన్నారు. అది ఉపన్యాసం కాదు. సృష్టి, చరిత్ర, సమాజం, ఆర్థిక సంబంధాలు, వర్గ పోరాటం. పెట్టుబడిదారీ వికాసం సామ్రాజ్యవాదం, ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం బోల్షివిక్ విప్లవం, భారత కమ్యూనిస్టు ఉద్యమం ఒక్కమాటలో మానవకథ వికాసాన్ని మొత్తం ఆ పిల్లలకు పండితుడు వివరించాడు. పిల్లలకు అది పూర్తిగా అర్థం కాలేదు. ఐనంత వరకు భద్రంగా ఆలోచనల్లో రంగరించుకున్నాడు. అప్పుడు కార్యక్రమం నిర్ణయమయింది. "మొదట మొదట గుట్టుగా ప్రచారం, తర్వాత ఎక్కువమంది రైతుల వత్తాసుపొందిన మీదట, బహిరంగంగా రైతుసంఘాల స్థాపన....".

ఆరోజే ఇద్దరికీ ఇళ్ళల్లో చెరిఒక ప్రత్యేక అనుభవం ఎదురైంది. అప్పుకు తండ్రి మెత్తని మనసు ఆరోజే తెలిసింది. "....తాను చదవాలి. చాలా చదవాలి. తను కష్టపడి పనిచేయాలి. చాలా కష్టపడి పనిచేయాలి. తన ఇంటికోసంమాత్రమే కాదు, జనంకోసం, జాతికోసం పనిచేయాలి. సాహసమైన పనులుచేసి తానుమంచి వాడుగా ప్రసిద్ధికి రావాలి.... మాస్టరులాగ, పండితులలాగ, వారు చెప్పిన ఎందరో వీరుల్లాగ...." అనుకున్నాడు అప్పు. మరోవైపు ఆరోజే చిరుకండని తండ్రి భూమిని జమీందారు అప్పు పేరిట స్వాహాచేశాడు. పొలాన్ని జమీందారుకు రాసిచ్చేసి గుండె పగిలిపోతూ చిరుకండని తండ్రి ఇల్లు చేరాడు. తన రెక్కలు ముక్కలు చేసుకొని బాగుచేసిన భూమిని. తన నెత్తురుని చెమటగా చల్లి రాజనాల్ పండేలా తయారుచేసిన భూమిని వదులుకోవడమంటే. నేల తల్లిమీద మమకారాన్ని తెగగోసుకోవడమంటే రైతు కనుగుడ్లను పెకలించినంత, గుండెను బద్దలు చేసినంత, ప్రాణాలు బలిగొన్నంత వేదనకు గురవుతాడు. ఆవేదన చిరుకండని తండ్రి ప్రవర్తనలో స్పష్టంగా కనబడుతుంది. ఆయన నెమ్మదిగా "ఈరోజు నుంచి మనం జమీందారుగారి పాలేళ్ళం కళ్యాణీ" అన్నాడు. గొంతుక తడబడింది. కళ్ళలో నీళ్లు నిండాయి...." తన తండ్రికి ఇది "బతుకులోని ఒక సూక్ష్మ సంధిగ్ధ క్షణమని" చిరుకండడు గ్రహించాడు. ఆ రోజంతా చిరుకండడు పొందిన అద్భుత అనుభవాలకు తోడు ఈ "పర్వతం వంటి దుఃఖం" కలసి అతని అవగాహనకు పదును పెట్టింది

ఈ క్రమంలోనే మాస్టరు రైతులకు పత్రిక చదివి వినిపించడం మొదలు పెట్టారు. జమీందారు ఒక కుటిలపు ఎత్తు పన్ని ఈ పత్రికా పఠనం సాగకుండా చేశాడు. ఐనా రైతులు ఒక రైతు గుడిసెలో చేరి పత్రిక చదివి వినిపించుకోవడం

కొనసాగించారు. మాస్టరు అక్కడికి రాలేకపోయినందువల్ల త్వరలోనే ఈ పత్రికా పతనం మూలబడింది. తర్వాత ఇద్దరు జమీందార్లమధ్య తగాదాను ఉపయోగించుకొని మాస్టరు గ్రామంలోకి రాత్రి పాఠశాలతెచ్చి రైతులకు చదువు నేర్పడం మొదలుపెట్టారు. రాత్రి పాఠశాల కయ్యూరు రైతులతో పోరాట అక్షరాలు దిద్దించింది. సోషలిస్టు, కమ్యూనిస్టు కరపత్రాలు వాళ్ళకక్కడే అందాయి

భర్త చనిపోయిన దేవకి మీద నంబియార్ తలపెట్టిన దౌర్జన్యాన్ని అప్పు, కణ్ణన్ ఎదుర్కొంటారు. ఈ వయ్యక్తిక ప్రతిఘటన జనం సామూహికంగా చేసేందుకు, వారిలో సాహసం నింపేందుకు ఉపయోగపడుతుందని మాస్టరు అంటారు. కొద్దిరోజుల్లోనే కౌలుదారు కృష్ణన్‌నాయర్ మీద దౌర్జన్యం చేసి పంట కోసుకుపోవడానికి నంబియార్ మనుషులు ప్రయత్నిస్తే రైతులు ఒక్కుమ్మడిగా ప్రతిఘటించి పంట కోసి కృష్ణన్‌నాయర్ ఇంటికి చేరుస్తారు. రైతులందరూ ఉత్తర మలబార్ రైతు మహాసభకు వెళ్ళి గుండెలనిండా ఉత్సాహం నింపుకొని తిరిగివస్తారు. రెండు రోజుల్లోనే కయ్యూరులో రైతుసంఘం ఏర్పాటుచడానికి సిద్ధమవుతారు. నంబియార్ బహిరంగంగా మాస్టరును తిట్టి పరీక్షలయిపోగానే ఊళ్ళోంచి వెళ్ళిపొమ్మంటాడు. కయ్యూరులో రైతుసంఘం ఏర్పాటవుతుంది.

రైతుల్లో కొత్తఆశలు నింపుతూ అధ్యక్షుడు అప్పు ఇంటిమీద ఎర్రజెండా ఎగురుతుంది. సంఘం ఏర్పాటు విని బెదిరించడానికి వచ్చిన పోలీసులు ఏమీసాధించలేక వెనుదిరిగిపోవడం చూసి రైతులు పొంగిపోతారు. సంఘబలం మరింత పెరుగుతుంది. సంఘానికి స్వంతంగా గుడిసెకోసం కుంజంబునాయర్ స్థలంఇస్తాడు. ఆ సంవత్సరం ముగియగానే మాస్టరు ఊరినుంచి వెళ్ళిపోతారు. బడి మూసేయించాలని నంబియార్ చేసిన ప్రయత్నాన్ని తిప్పికొట్టి సంఘం బడిని కొనసాగిస్తుంది. అప్పుడే ప్రపంచయుద్ధం ప్రారంభమవుతుంది.

"యుద్ధం ఆరంభమైంది ఎక్కడో ప్రపంచపు మారుమూలలో ఎక్కడో దూరంలో వున్న అడవిలో నిప్పుపడ్డట్టు. అయితేదాని వేడి కయ్యూరికి తాకకపోలేదు." సైన్య సమీకరణ జరిగినప్పుడు సైన్యంలో చేరదలుచుకున్నవాళ్లు చేరవచ్చుననీ, అయితే దేశద్రోహం చెయ్యమని ప్రతిజ్ఞచేయాలనీ సంఘం అంటుంది. "నాగేలు పట్టే చేయి తుపాకి ఎత్తడానికి నేర్చుకున్నట్టు అవుతుంది" అంటాడు చిరుకండడు. అదే సమయంలో తెలిచేరి నుంచి అబూబకర్ ఊళ్లోకి వస్తాడు. తెలిచేరిలో

సంఘంలో పనిచేసిన అబూబకర్ ఇక్కడ వలంటీర్ దళాన్ని ఏర్పరిచి శిక్షణ ఇవ్వడం మొదలుపెడతాడు.

"ఇక్కడ విప్లవకారులు పోగయ్యారు. సర్కారు భూమి స్వాధీన పరచుకున్నారు. సైన్యం కట్టారు. పోటీ ప్రభుత్వం నెలకొల్పారు." అని నంబియార్ ప్రభుత్వానికి ఫిర్యాదు చేశాడు. అప్పుడే తాలూకా రైతు మహాసభ కయ్యూరులో జరపాలని నిర్ణయించారు. సభ ఏర్పాట్లలో వలంటీర్లు, రైతులు తలమునకలయిపోయారు. అప్పుడే ఒక పోలీసు నంబియార్‌కు రక్షణగా ఊళ్లోకి వచ్చాడు. ప్రతి ఉదయమూ ఊళ్ళో కవాతు చేస్తున్న వలంటీరుదళాన్ని బెదిరించడానికి ప్రయత్నించి సాధ్యంకాక కొంత దూరం వెంటనడిచాడు. చివరికి కవాతును ఆపబోయి, జరిగిన ఘర్షణలో పరుగెత్తుతూ తేజస్వినిలో పడి ఈదలేక చనిపోతాడు.

వెంటనే పోలీసులు ఊరిమీద పడి ఊరిని కుక్కలు చింపిన విస్తరి చేశారు. ప్రజల గుండెలమీద పిశాచ నృత్యం చేశారు. మొదటిరోజు ఎనిమిది మందిని, మర్నాడు ముప్పైమందిని, ఆ మర్నాడు పదిహేనుమందిని ... ఇట్లా కనిపించిన మగవాళ్ళనల్లా అరెస్టు చేశారు. స్త్రీలను అప్పటికే గ్రామంనుంచి తప్పించినందువల్ల వాళ్ళు ప్రమాదం రాకుండా తప్పుకున్నారు. కాని అనేక మంది రైతుల గుడిసెలు కాలి బూడిదయిపోయాయి. పారిపోలేక పడివున్న ఒక రోగిష్టి స్త్రీని నలుగురు జవాన్లు చెరిచి చంపేశారు.

పోలీసులు రాకముందే బైటపడి మాస్టరుకోసం, పండితులకోసం తిరిగివేసారి మలబార్ అంతటా అమలయిన రాక్షస వేటలో నిలువనీడలేక, కయ్యూరుమీద తమకోసమే ఇంకా దమనకాండ సాగుతున్నదని విని అప్పు, అబూబకర్‌లు కయ్యూరికి వచ్చి పోలీసుల చేత చిక్కుతారు. తర్వాత విచారణ తంతు, ఉరిశిక్ష, ఉరిశిక్ష రద్దు చేయించడానికి ప్రయత్నాలు.... కళ్ళనిండా నీళ్ళతో చివరి అధ్యాయాలు చదువుతున్న పాఠకుడికి స్తూపావిష్కరణ గురించి చెప్పి సూత్రధారి కథ ముగిస్తాడు.

ఇరవై ఏళ్ళ తర్వాత మలి ప్రచురణకోసం సిద్ధం చేస్తున్నప్పుడు రాస్తున్నప్పటిలాగే కళ్లధారలు కట్టేట్టు ఏడ్చానని రచయిత ముందుమాటలో రాశారు. ఏమాత్రం ఆర్ద్రహృదయమున్నా చివరి అధ్యాయాలు చదువుతుంటే కళ్లుచెమర్చకుండా ఉండడం అసాధ్యం. అసలు చివరి అధ్యాయాల్లో మాత్రమే కాదు, నవల మొత్తం

గానే చాల ఆర్ద్రంగా, హృద్యంగా, సుతిమెత్తగా- కొన్నిచోట్ల విప్లవకారులకు ఉండ
తగదనిపించేంత సెంటిమెంటల్‌గా- నవల నడిపించారు. ఈ పద్ధతివల్ల పాఠకుడి
మనసుమీద బలమైన ముద్రవేయడం సాధ్యమేగాని కొన్ని సెంటిమెంట్లు చాల కృత
కంగా తోస్తాయనిపిస్తుంది. (ఉదాహరణకు అప్పు, చిరుకండన్‌లు విప్లవంలోకి
వచ్చినరోజు మాస్టర్ రెండు మామిడి మొక్కలు నాటడం. వాళ్ళను ఉరితీసినరోజు
నంబియార్ ఆ చెట్లను కొట్టించడం, చాలచోట్ల వాటి ప్రస్తావన రావడం)

విప్లవకారుల పెళ్ళి, ప్రేమ గురించిన చర్చలూ, అనుభూతులూ మనసుకు
హత్తుకునే పద్ధతిలో- ఒక్కొక్కచోట కాల్పనికమనిపించేంత సున్నితంగా చిత్రించారు.
అట్లాగే కయ్యూరు కాలిపోతుంటే బైటి ప్రపంచం నిమ్మకు నీరెత్తినట్టున్నదనీ,
నిర్బంధం తర్వాత మరికొన్ని సందర్భాలలోనూ అప్పు అధైర్యపడి తనకు తానే
ధైర్యం చెప్పుకున్నప్పుడు, మరొక కామ్రేడ్ ఆశ్వాసం యిచ్చినప్పుడు చిత్రించిన
పద్ధతి నిరాశామయ పరిస్థితుల్లో అతి మామూలు మాటలలోనే ఎంతెంత అద్భుతమైన
ఆశను రేకెత్తించవచ్చునో తెల్పుతుంది

ఒక వాస్తవగాథను కళారూపంలో చిత్రించేటప్పుడు దానికి కొంత కాల్పనిక
మెరుగుపెట్టడం బహుశా అవసరమే కావచ్చును. ఆ అవసరాన్నే రచయిత "సమ్యక్
సత్య దర్శనం కోసం చిన్నచిన్న వాస్తవాంశాలు అప్రధానమవుతాయి" అన్న గెథె
మాటలతో సమర్థించుకున్నారు "భారతదేశ శ్రమజీవులు కొనసాగిస్తూ వచ్చిన వర్గ
సమర ఇతిహాసం సుదీర్ఘమైంది. దాని రోమాంచకారి అయిన ఒక అధ్యాయం
కయ్యూరు రైతుల పోరాటం .... నేను రాసింది కయ్యూరు రైతుల పోరాటం నివేదిక
కాదు. ఆ నివేదిక కేరళ కర్షక జాగృతి చరిత్రలో ఒకభాగం నేను చేసింది కయ్యూరు
పోరాట అంతస్సత్వాన్ని, చైతన్యాన్ని కళలో చెరపట్టడానికి (sic) ప్రయత్నం...."
అన్న నిరంజన తన ప్రయత్నాన్ని | అతి ప్రతిభావంతంగా కొనసాగించి,
సఫలమయ్యారు.

తిరుమల రామచంద్ర అనువాదంలో తెలుగులో కొన్ని భావాలకు రూఢీ అయి
పోయిన మాటలను వేరే భావాలు చెప్పడానికి వాడినారు ముక్కస్యముక్కార్థ అని
చెప్పుకుంటే అయన వాడిన మాటలు సరైనవేకావచ్చుగాని ఆమాటలకు సాధారణ
పాఠకుడు ఇచ్చుకునే అర్థం అక్కడ అన్వయిస్తే అపార్థానికి దారితీస్తుంది. (ఉదా
హరణకు చెరపట్టడం అనే మాట ఇప్పుడు బలవంతాన, ఇష్టానికి వ్యతిరేకంగా బం

ధించి ఉంచడం అనే అర్థంలో వాడుతున్నాం. తి.రా. దాన్ని చేపట్టడం, సాధించడం, పొందడం అనే అర్థంలో వాడినారు. అలాగే చులకన కావడం అనే మాట ఇప్పుడు మనం వ్యతిరేకార్థంలో తగ్గడం అనీ, పోలికలో కిందిస్థాయిలో ఉండడం అనీ అర్థంలో వాడుతున్నాం. తి.రా. మనసుమీద బరువు దిగిపోవడానికి, మనసు తేలిక కావడానికి పర్యాయపదంగా మనసు చులకన కావడం అన్నారు।) అట్లాగే విప్లవకారుల విషయంలో వాడడం ఎబ్బెట్టుగా తోచే దేగ పోలికతో విప్లవకారుల్ని పోల్చినారు. ఇక పద్య, అవగుంఠనవతి, నిక్కలలు అనే మాటలు ఎన్ని దశాబ్దాల కిందివో!

ఇంతకూ కయ్యూరు వీరుల చరిత్ర ఎందుకు, ఎవరికోసం? ఉరిశిక్ష నిర్ధారణ అయింతర్వాత కయ్యూరు కామ్రేడ్స్‌ను కలపడానికి పి.సి. జోషి, సుందరయ్య, కేరళ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత, అమరుడు కామ్రేడ్ కృష్ణపిళ్లై కన్ననూరు సెంట్రల్ జైలుకు వెళ్లారట. ఉరికంబం మీద నిలిచిన నలుగురు వీరులు పిడికిళ్ళు బిగించి తమ నాయకులకు రెడ్ సెల్యూట్ చెప్పారట. జోషీ ఏదో మాట్లాడబోయి, దుఃఖం గొంతులో అడ్డంపడి మాట పూర్తి చేయకుండానే పసిపిల్లవాడిలా వలవలా ఏడ్చారట. అప్పుడు కయ్యూరు కామ్రేడ్స్ "మా జీవితాల్ని ఎందుకు త్యాగం చేస్తున్నామో మాకు తెలుసు. మా గురించి చింతించకండి. మా కామ్రేడ్లను నడిపించండి వెనుదిరిగి చూడకుండా మన గమ్యందాకా ముందుకే సాగిపొండి...." అన్నారట. (టి.వి. కృష్ణన్ కేరళాస్ ఫస్ట్ కమ్యూనిస్ట్ లైఫ్ ఆఫ్ సఖవు కృష్ణపిళ్లై, సిపిఐ, 1971.)

కయ్యూరు కామ్రేడ్స్‌ను నడిపించిన విప్లవ సిద్ధాంతం నిగ్గుదేలిన నక్సల్బరీ పంథాలో నడిచి రెండు దశాబ్దాల తర్వాత అదే లక్ష్యంకోసం 1975 డిసెంబర్ 1 న ఉరికంబాల కెక్కారు కామ్రేడ్స్ భూమయ్య కిష్టాగౌడ్‌లు. పార్టీగా, వ్యక్తులుగా ఈ కామ్రేడ్స్ ఉరిశిక్ష రద్దుగురించి విజ్ఞప్తులు చేసినమాట నిజమేగానీ సిపిఐ ఈ కామ్రేడ్స్‌ను ఉరితీసిన ఎమర్జెన్సీ కరాళరాత్రిని ఫాసిస్టు వ్యతిరేక సుప్రభాతంగా వందిమాగధ గీతాలు పాడింది. (Faith is the bird that feels light in darkness- టాగోర్)

ఆనాడు బలహీనమైన హృదయంతో విలపించే అర్హతఅయినా పి.సి. జోషికి ఉందేమోకాని నెహ్రూ ఇందిరల పార్లమెంటరీ కుష్టుపాదాల చెంత రైతాంగ పోరాట ఖడ్గాన్ని కానుకగా అర్పించిన రివిజనిస్టులు ప్రేక్షకులుగా కాదు నేరంలో భాగస్వాములుగా చరిత్రలో మిగిలిపోతారు.

# నువ్వెంతకాలముంటావు సూర్యుడా?

పౌదా

కొత్త లేదు
పూరించిన నాస్వరపేటిక నాదాలకు హొయలు లేవు
వింత లేదు
పారించిన నా నేత్రపాటిక పదునెక్కిన చూపులలో సొగసులేదు
శాంత తరంగాలకోసం నడచి
సముద్రంచేరి పెనుసుడిగుండాల్లో చిక్కుకోవడం
కొత్త కాదు
సహారా ఇసుకసముద్రంపై
విహారానికి వెళ్ళి టైఫూన్‌ల వాతబడటం
వింత కాదు
ఈ అసంగత విశ్వపరీవృతమైన ఓ నా జాబిల్లీ
నిన్ను తాగితాగి అలసిపోయాను
అయినా వెగటు పుట్టదు వెన్నెలా
వెన్నెల సాక్షి
కొత్త లేదు వింత లేదు
అదే నిషా అదే నిర్బంధం అదే జీపు అదే జైలు
అవే ప్రశ్నలు అవే సమాధానాలు
అవే పదాలతో అవే పాదాలతో మళ్ళీ మళ్ళీ
అరెస్టు పాతదే కారణం సరికొత్తది
అధికారానికి అతి సహజమైనది

---

కయ్యూరు కామ్రేడ్స్ తమ జీవితాన్ని ఎందుకు త్యాగం చేశారో అందుకే తమ సర్వశక్తులూ ధారబోసి పోరాడుతున్న వారిదే కయ్యూరు వారసత్వమూ, కయ్యూరు పోరాటగాథా....

(చిరస్మరణ - కన్నడమూలం : నిరంజన - తెలుగు : తిరుమల రామచంద్ర - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ, వెల: రు. 14/- ఏ పట్టణంలో వున్న విశాలాంధ్ర బుక్ హౌజ్‌లోనైనా దొరుకవచ్చు)

# మమకారం

బి. ఎస్. రాములు

ఆ పల్లె రెండు జిల్లాలను కలిపే రహదారికి పన్నెండు కిలోమీటర్ల దూరంలో వుంది. ఆరాత్రి లారీల రాకపోకల ధ్వనులు అక్కడికి కూడా లీలగా గాలితోపాటు చేరుతున్నాయి.

వుత్తర ప్రాంతాన్నీ దక్షిణ ప్రాంతాన్నీ రెండు జిల్లాలుగా చీల్చిన గోదావరి పరవళ్ళ ధ్వనులు ఆ నిశీరాత్రిలో నిద్రపోతున్న పల్లెకు తన నిత్య చైతన్యాన్ని ఆదర్శంగా స్వీకరించుమని చెవిలో గుసగుసలు పెడుతున్నట్టుగా వున్నాయి.

జిల్లా పరిషత్‌వారు వేయించిన అప్రోచ్‌రోడ్ మరమ్మతులేక పాడుబడిపోతోంది. గంతలు గతుకులు. ఎడ్లబళ్ళు చేసిన దోడ్డుకోత. పాములా ఆపక్కనే మెలితిరుగుతూ కాలిబాట.

---

ఒక అడుగువెనక్కునెట్టి
మళ్ళీ వెళ్ళనని సంతకం చేయించుకొన్నా
అది నిజంగా నా సంతకమవుతుందా?
అలసినా విశ్రాంతికోసం ఎన్నడూ నీడకాగని ఓనా సూర్యుడా
నువ్వెంత కాలముదయిస్తోవుంటావు?
ఎంతకాలం నిప్పులు చెరుగుతోవుంటావు
అవేకోణాలనుండి అవే కిరాణాలతో మళ్ళీ మళ్ళీ
అంతకాలమూ ఫుట్‌పాత్‌లమీద ఇళ్ళకప్పులమీద
రైలుపట్టాల మధ్య పార్లమెంటుమీద
సముద్రంమీద సగంవిరిగిన మేఘంమీద
నాగలి నడకనడుమ దాపపెట్టు నిట్టూర్పుమీద
ఖాకీకుండలోపల పగిలిన గుండెదాపుల
బుల్లెట్‌లోపల నెత్తుటిపైన
కన్నీటి చుట్టూ మృత్యువు ముందూ
నేను చెప్పినదే పదేపదే చేస్తాను మళ్ళీ మళ్ళీ యింకా యింకా!

(కూలిపోరాటంలో అరెస్టుచేయబడి, బస్సు కాల్చివేత అనుమానంమీద నాతో పాటు నిర్బంధాన్ని ఎదుర్కొన్న సహచరుడు కా॥ ఎస్. ఆర్ కు స్నేహంతో)

వూరికి పడమర దిక్కుగా ఆ వాడ వుంది. ఆ వాడలో చివరి గుడిసె అది. ఆ వాడకూ ఆ చివరి గుడిసెకూ నడుమ సర్పంచు పెరడుంది. అందువల్ల ఆ గుడిసె మరీ విడివడ్డట్టుగా వుంది.

చాలా ఆలస్యంగా నిద్రకుపక్రమించినా ఎందుకో తొందరగా మెలకువ వచ్చేసింది మైసమ్మకు. అసలు నిద్ర పట్టిందో లేదో కళ్లు నులుముకొని లేచికూర్చుంది.

మనుమరాలు లచ్చవ్వ గాఢనిద్రలో వున్నట్టుంది. కడుపులోకి అదుముకున్న కాళ్ళని సరిచేసి గాఢంగా నిట్టూర్చింది

మైసమ్మ కూతురు రెండో కాన్పు కష్టమై తల్లీ పిల్లా కన్నుమూసారు అల్లుడు ఆర్నెల్లు తిరక్కముందే రెండో పెళ్ళి చేసికొని మొదటి కూతుర్ని యిక్కడ వదిలిపెట్టి పోయాడు. మూడేళ్ళ వయసునించీ తనే సాదుతోంది తండ్రి వుండీ అనాథ. మేనమామ వుండీ అనాథగా బతుకీడ్వడం, దీని దురదృష్టం. మైసమ్మ దుఃఖం వచ్చినప్పుడల్లా విలపిస్తుంది. వాస్తవంగా మైసమ్మకూడా అనాధలాగే బతుకీడుస్తోంది. యిద్దరు అనాధలొకరి కొకరు తోడయ్యారు. ఆ ఒక్కతే పరిస్థితం మైసమ్మ చేదోడు వాదోడు.

వున్నొక్క కొడుకు సంగం అంటూ తిరుగుతుంటాడు. ఇటీవల రెండు బ్యాచీలుగా వరుసగా అరెస్టులు జరగడంతో అరెస్టయ్యాడు. రెండువారాలు లాకప్ చిత్రహింసల అనంతరం అబద్దపు కేసులో యిరికించి జైలుకు పంపారు పోలీసులు జైలుకు పంపికూడా రెండు నెలలు కావస్తోంది. ఇంకెన్నడు విడుదలౌతాడో అని ఆ తల్లి శంకరయ్యని కన్పించినపుడల్లా ఆవేదనగా, కోపంగా అడుగుతుంటుంది.

శంకరయ్యఅంటే జైలుకు పోయినవాళ్ళు పోగా, పారిపోయినవాళ్ళు పారిపోగా, వూళ్ళో సంగం కుంటుపడకుండా నడుపుతున్నవాడు.

ఎన్నిసార్లు మాటుగాసినా పోలీసులకు దొరకకుండా చాకచక్యంగా తప్పించుకున్నవాడు, ఎపుడు యింటికివస్తాడో ఎపుడు ఎక్కడకువెళ్తాడో ఏపనిచేస్తాడో అంతు చిక్కనీయనివాడు.

'ఈ రాత్రి శంకరయ్య వూళ్లెనేవున్నడట' అన్నపుకారు విన్నాచాలు ఈ రోజు ఏదో జరుగుతుంది, ఎవరిదో పనిపడ్తాడు అని ఆరాత్రి నిద్రకరువు చేసికొంటారు దొరలు.

దొరల్ని అదే భయంలో వుంచుతున్నాడు శంకరయ్య. అతి తక్కువగా పూట్లో పడుకుంటున్నాడు. చేన్లమీద చెలకలమీదే ఎక్కువరాత్రిలు గడుపుతున్నవాడు సాయంత్రం కలిసి తనతో చెప్పిన విషయం విన్నప్పటినించీ పాతకష్టాలన్నీ మరిచి మనసు వుత్సాహంతో పురకలు వేస్తోంది. అసలు ఆ సంతోషమే నిద్రపట్టకుండా చేసినట్టుంది.

ఎప్పుడు తెల్లవారుతుందో అని ఆలస్యానికి విసుక్కుంటూ ఎదిరిచూస్తూన్నది. తన సంతోషంలో పాలు పంచుకోవడానికెవరున్నారు? వున్నొక్క కొడుకు జైల్లోనే వుంటున్నాడాయె. పాపం! తను శంకరయ్యను వాని విడుదల కోసం కోపగించి నప్పుడల్లా ఎంత బాధపడ్డాడో! కాని శంకరయ్యది ఎంత మంచిమనసు. ఈ ముసల్దాని గురించి ఎంత కష్టపడుతున్నాడు.

శంకరయ్యే కాక సంగపోల్లందరు ఈ ముసల్దాని కోసం ఎన్ని కష్టాలనుభవించారు! ఎన్ని నష్టాలపాలైనారు!

తన భూమి తనకు యిప్పించాలని పట్టుబట్టి ప్రజా పంచాయతీ నిర్వహించి తీర్పు యిచ్చారు పూరుమీదపడ్డ పోలీసులు తన ఒక్కదానియేకాదు. సంగపోల్లందరివి, సంగపోల్లు అయినోల్లయి, కానివారివికూడా ధాన్యం బావుల్లో పారబోశారు. తలుపులు విరగ్గొట్టారు, కుండలుబోకెలు, మంచాలు అన్నీ తుక్కుతుక్కు చేశారు. తనకైతే యింట్లో తినడానికి కంచం కూడా గతిలేకుండా చేసిపెళ్ళారు. అయింటికాడ ఓ పూట ఈ యింటికాడ ఓ పూట మనుమరాల్ని వెంటేసుకుని వెళ్ళదీసింది ఎవరూ లేదనలేదు. ఎంతమంచోల్లు శంకరయ్య వాళ్ళకు చెప్పివుండాలి. ఎంత చల్లని మనసు !

ఎంతకోపానికి వచ్చినా 'మున్సిఫ్ కోర్టుల బేలు దొరకలేదు. సెషన్ కోర్టుల రెండుసార్లు పిటిషన్ పెడ్తె రెండుసార్ల కొట్టేసిరి. మల్లోసారి ఏస్తనన్నడు వకీలు. మేంజేసే అన్ని ప్రియత్నాలు తప్పకజేస్తం. నువ్వేం ఫికిరుపడకు.' అని సముదాయిస్తాడు.

ఏందో తన పిచ్చి! కొడుకువిడుదలై తన యింటిపట్టునే వుంటడని, పోలీసులు వుండనిస్తరని భ్రమ. శంకరయ్య ఏపాటి ఇంటికాడ వుంటున్నడు? అదేందోగని తల్లిపేగు గుంజుద్ది తన కొడుకు కండ్లెదుట కనపడాల్నని. నిజంగ కొడుకు గూడ శంకరయ్య తీర్గ ఆప్యాయంగ ఉంటడా?

ఆలోచనలతో నిద్ర మబ్బు వదలినట్టుంది. గోదావరి గలగలలు, లారీల రొదలు కలగలపి చెవిని తాకుతున్నాయి.

మెల్లగా తలుపుదీసి బయటకు నడిచింది. వూరికి కొసన వుండడంతో గాలి రివ్వునవీస్తోంది. వీస్తున్న గాలితో ఎక్కడో రాళ్ల ఎత్తేస్తున్నశబ్దం చెవిలోకి చొచ్చుకు పోతోంది.

ఏమిటో! అని చెవీ, దృష్టి అటువేపే సారించింది. అల్లంత దూరాన రోడు పులుపుమీద దయ్యంలా ఎవరో నిలబడి వున్నట్టు గమనించింది.

'ఎవర్రా!' కొంచెం భయపడుతూనే గట్టిగా కేకేసింది.

'నేను రంగయ్యనే' రెండడుగులు వేసి వస్తూ మెల్లిగా చెప్పాడు రంగయ్య.

నాలుగడుగులు ముందుకేసింది మైసమ్మ. పరీక్షగా చూసింది. ఆశ్చర్యంగా అడిగింది. 'ఏంజేస్తున్నవు గిరాత్రి'

'ఇంక రాత్రెక్కడున్నది! తెల్లారుతంది! అక్కడ పొలుమారుకాడ పోలీసు జీపు రాకుంట శంకరన్నవాళ్లు రోడుమీద బండకుచ్చె పేరిస్తున్నరు. దొరలు ఎవలన్న ఇటువస్తె సూసుటానికి ఈడ కావలి వున్న' అన్నాడు రంగయ్య.

'రఘుపతి దొర ఎట్లత్తడు మరి!'

'రాత్రే అచ్చిండు. అచ్చి దొరలంతకూసుండి మన పంచాయతుల ఏం మాటా డాలె ఎట్ల మాట్లాడాలె అని యిస్మడిచ్చు (చర్చించు) కొన్నరు గూడ.'

'ఈతాపకు పోలీసులత్తె మనం ఏ సిచ్చంటె ఆ శిక్షకు ఆల్లు ఒట్టువెట్టుకున్న రంటిరి గద! మల్ల గిదేంది?'

'ఎందుకైనా మంచిది. మన జాగర్తల మనం వుండాలెగద'

'ఈ పంచాయతుల మా పొలం మాకు వచ్చేనంటవ? రఘుపతి దొర ఒప్పు కునేనంటవ' ఏ మూలనో అపనమ్మకం పట్టిపీడిస్తోందో లేక మరోసారి తప్పకవస్తుం దని రంగయ్య నోటినించి వినాలని వుందో అడగనైతే అడిగింది మైసమ్మ.

'నీయవ్వ గింతజేత్తున్నదెందుకే యిగ! మీభూమి, పట్వారిగాడు పట్టాజేయించుకున్న భూమి గురించేగాదె ఇంతగత జరిగింది గంతమంది జేల్లకోయిరి. గంతసామాను

పోలీసులు పాడుజేసిపోయిరి. యిగ ఏం సేక్కుంటడే.... అన్నిజేసిరి అన్నిజూస్తిమి. లం....కొడుకు ఒప్పుకోకపోవటానికి అదేమన్న వాని అయ్య సొమ్మా! తాతసొమ్మా! మీ భూమి అది! మీ భూమిలనే మిమ్ముల పాలేర్లజేసి యిన్ని రోజులు మన కష్టం తిన్నది సాలదటనా! అన్నిటికీ తెగాయించి వున్నం మనం మనను ఎంత గోస వుచ్చుకోవాన్నో అంత గోస వుచ్చుకున్నరు. ఇంకేంజేత్తరు? అదిగూడసూద్దాం.'

ఆమాటతో మైసమ్మకు ఏక్కడలేని సంతోషం కలిగింది. ఆ వుత్సాహంలో 'నేనుగుడ బండ అందిత్త' అని పోబోయింది.

'నీకేం చాతనైతదే వద్దు' అని వారించాడు రంగయ్య.

రంగయ్యతో కబుర్లకు దిగింది మైసమ్మ.

రంగయ్యవయస్సూ, మైసమ్మవయస్సూ కొంచెం అటూయిటూగా వుంటుంది.

రంగయ్యకూ తనకూ కొన్ని విషయాల్లో పోలికల్ని గ్రహించడం వల్ల కొంత స్నేహశీలంగా మాట్లాడుతుంటుంది మైసమ్మ, రంగయ్య చెయ్యెత్తు ఎగిదిన కొడుకు సంగంపనిమీద కనబడకుండా ఏదో వెళ్ళిపోయాడు. గుండెదిటవు చేసికొన్న రంగయ్య తనకే ధైర్యం చెపుతుంటాడు.

తనకొడుకూ రంగయ్య కొడుకూ నెంతో మంచి స్నేహితులు రంగయ్య కొడుకు ఎంత చక్కటివాడు. కాలేజీ చదువుతున్నపుడుకూడా యింటివద్ద వున్నపుడు ఎడ్లను మేపేవాడు. తనకొడుక్కు వాడంటే ఎంత అభిమానం? వొక్కనికే అని ఏమిటి! వానితోటివాల్లల్లో వాడంటే ఎంత అభిమానం! వాల్లందరుగల్సి వాన్ని మేప నిచ్చేవారుకాదు. వంతులవారీగా వాళ్ళేమేపేవాళ్ళు. కథలు చెప్పుమని, పాటలు పాడు మని, అక్కడి సినిమాలగురించి, కాలేజీ చదువులగురించి మరీమరీ అడిగి చెప్పించు కునేవారు.

ఓరోజు రంగయ్య వచ్చి తనతో ఏమనిచెప్పాడు వాడు అందరికి నేర్పుతున్న పాటలు, మాటలు విని ఆశ్చర్యపోయాడట! ఒకింత భయపడ్డాడుకూడా! ఆ మాటలు గుట్టల్ల అన్నల మాటల్లావున్నై అదికూడారంగయ్యకు తెలీకపోయేది. ఆరోజు అవ్వ ఏదో అందని అలిగి అన్నం తినకుండానే వెళ్ళిపోయాడట! తాను సద్ది దీసుకుపోయే సరికే వాడు మిగతావాళ్ళ సద్ది తిన్నాడు. ఏదో చెప్తున్నాడు, వాళ్ళల్లో వాడు మరీ యింత అభిమానం సంపాదించాడని అపుడుగాని తెల్సిరాలేదు.

అయితే ఆ రోజుల్లో సంగం గురించి అంత పట్టించుకునేవాడుకాదు రంగయ్య. అప్పటికి ఆవూళ్లొ సంగం పుట్టి చాలా రోజులే అయింది. రంగయ్య భూస్వామికాదు పాలేరూ కాదు. వున్న రెండెకరాలు తనకుతానే సాగుచేసుకొంటున్న చిన్నరైతు. సంగం గురించి తొల్తలో అంటీఅంటనట్టుండేవాడు రంగయ్య.

కాని కొడుకు కాలేజీ చదువు వదిలిపెట్టి అన్నల్లో కల్సిపోవడం, కొడుకోసం తనని పోలీసులు బాధించడం, ఆస్థితిలో సంగం తనగూర్చి పట్టించుకోవడం వల్ల సంగానికి చేరువైపోయాడు.

ఓసారి వరికోతల సమయంలో కొడుకును 'పట్టిచ్చేదాక విన్ను విడువమని' పోలీసులు యిరవైరోజులు లాకపులో వుంచి 'ఆవరి ఎవరుకోయొద్దు' అని బెదిరించి నపుడు సంగం ఏమైనాసరే అని సకాలానికి వరికోసింది. వచ్చిన తర్వాత కూలీ యివ్వబోతే ఎవరూ తీసుకోలేదు. దాంతో రంగయ్యకు తనకొడుకుమీద వాళ్ళకున్న అభిమానం తెల్సివచ్చింది.

ఆ అభిమానం ముందు రంగయ్య వినమ్రింగా తలవంచాడు. అప్పటినుండి తానూ సంగంలో ఒకడైపోయాడు.

ఏడ్పు విన్పించడంతో గుడిసెలోకి పరుగున వెళ్ళింది మైసమ్మ. 'నన్నిడిసి పెట్టి ఎటువోయినవ్' అని గారాబంగా మైసమ్మను చేతులపైకొడ్తూ ఏడుస్తూ అడుగు తోంది మనుమరాలు.

మనుమరాల్ని సముదాయిస్తూ మైమరిచిన వుత్సాహంలో 'మన వొలం మన కత్తదటనే' అని ఏదేదో చెప్పింది. వింటూ వింటూనే మళ్ళీ నిద్రలోకి జారి పోయింది మనుమరాలు.

మైసమ్మ వుత్సాహం నీరు గారిపోయింది. తన సంతోషం పంచుకోవటానికి యింకెవరున్నారు? వున్నొక్క కొడుకుజైల్లోనే వుంటున్నాడాయె! తనపెనిమిటి బతికి వుంటే ఈ విషయం విని ఎంతపొంగిపోయేవాడో! అలా గతం కళ్ళ ముందు కదలాడింది.

తనకు వయస్సు ఈడేరిన రోజులవి. తన తల్లిదండ్రులు పెనిమిటివద్దకు పంప కుండా మొరాయించారు. తనతో పని చేయించుకోనుమరిగి పోరిది ల్యాతబొక్క అని తోలించక చాలాకాలం యింట్లోనే వుంచుకున్నారు.

నిజంగా అపుడు అలాంటి పరిస్థితే అట్లావుండేది. ఏం బాకీయో కాని అయ్య దొరలబాకీ ఎంతకట్టినా తీరేదికాదు ఎంతచేసినా తీరేదికాదు. ఓసారి బాకీకట్టనందుకు దొర తన తండ్రిని కొట్టింది కళ్ళారాచూసింది. యిప్పటికీ కళ్ళల్లో మెరుస్తూ వుంటుంది ఆస్థితిలో తాను తల్లిగారింటి వద్దే వుండిపోయింది.

పెనిమిటి మంచి వయసుమీదున్నాడు. గంగిని గుంజాడు. దొర దాన్ని పెద్ద పంచాయితీగా కావాలని పెంచాడు. అయిదు వందల దండుగేశాడు. గంగికి దూరపు సంబంధం వస్తే ఖాయం చేయించి తులం బంగారం పెట్టాడు దొర. అయిదువందలు, తులంబంగారం దండుగుకు కలసి వెరసి తమ పొలం కాజేశాడు దొర.

అయ్యా అప్పా అని బతిమాలితే ఆ పొలంలో పాలేరుగా పనిచేయటానికి అంగీకరించాడు. ఆ పొలం ఏనాటికైనా తిరిగి తమకే చెందాలని యిబ్బడిముబ్బడి రాబడితెస్తే కొన్నాళ్ళకు దొర దయతలచి తమది తమకు వదిలి పెడతాడని ఓ గుడ్డి నమ్మకం పెనిమిటికి చచ్చేదాకా వుండేది. దొరకూడా చూద్దాం అని తీయగా మాట్లాడ్తే నిజంగానే వస్తుందని భ్రమకు లోనై రాత్రి పగలు నిద్రాహారాలు మాని పంటలు దీసేవారు.

కాని పొలం తమది తమకు చెందకుండానే పెనిమిటి గతించిపోయాడు: పని చేసిచేసి నెత్తురు నీరుజేసికొని పండించిన పంటంత దొరపాలైంది. నెత్తురు చచ్చిన చెత్త కాటిపాలైంది.

బతికి వుండివుంటే యిన్నేండ్ల తర్వాతయినా తమ పొలం తమకు చెందుతు న్నందుకు ఎంత సంతోషించేవాడో!

పెనిమిటి చనిపోయాకనైనా దొరకు తనమీదైనా జాలి కలుగ లేదు. తన కొడుకు ముఖమైనా చూడలేదు. మీదు మిక్కిలి సంగంబుట్టాక పల్లె నుంచి పట్నా నికి మకాం మార్చిన రఘుపతి దొర 'నేను పట్నంల వుంటున్న యింక పల్లెలో వ్యవ సాయం చూసుకునుడు కుదిరేటట్టులేదు. అమ్ముకుంటె పట్నంల ఏదన్న దంద చేసికోవచ్చను'కొన్నాడు.

కాని సంగం అదివరకే ఓ కట్టడి చేసింది. దొరల భూముల్ని "అమ్మనీయం కొననీయం"

దొరల భూములు పూర్వం ఎవరివో ఎవరినించి లాక్కున్నారో ఆ లిటిగేషన్లను ప్రజా పంచాయతీ నిర్వహించి ఎవరికి చెందాలో సంగం తీర్పు యివ్వడం ప్రారంభమైంది.

రఘుపతి దొర మిగతా దొరల్లా కాకుండా చాలా గుంభనంగా గంభీరంగా వుంటాడు. తొందరగా బయటపడడు. మాట పోగొట్టుకోడు. అందుకే మస్కట్ పోయివచ్చి వెంకటివద్ద మైసమ్మ పొలం అమ్మకానికి అడ్వాన్సు పుచ్చుకున్నట్టు కొంత ఆలస్యంగా తెలిసింది. అపుడు సంగం పెట్టిన పంచాయతీకి దొర హాజరైవుంటే ఈ సమస్య ఆరోజే తేలిపోయేది. అందుకే దొర కావాలనే తప్పించుకున్నాడంటాడు శంకరయ్య.

జిల్లా కేంద్రంలో కో ఆపరేటువంటి పదవులుండడంతో ఎప్పుడూ పని. అందువల్ల పల్లెకు రావడం చాలతక్కువ. ఏదో మినిష్టరు ప్రోగ్రాంలో తోడు వెళ్ళడంవల్ల ఆరోజు రాలేకపోయానని చెప్పాడు దొర.

తాను రాకున్నా సంగం, మిగతా దొరలు ఎట్లా నిర్ణయిస్తే అట్లా అంగీకరిస్తానని అన్నాడు. అలా రఘుపతి దొర లేకుండా జరిగిన ప్రజా పంచాయతీలో పట్వారీ ఎనిమిదెకరాలు నష్టపరిహారం యివ్వకుండాను రఘుపతి దొరకు సంగం నిర్ణయించిన ధర చెల్లించి మైసమ్మకు పొలం తిరిగి యిచ్చేయాలని నిర్ణయమైంది.

ప్రజలు దున్నుకొంటున్న ప్రభుత్వ భూమిని ఎవరికి తెలియకుండ తన పేరిట పట్టా చేసికొన్న పట్వారి సగానికిపైగా అమ్మేశాడు. కొన్నది పేదలే కావడంతో పట్వారి బతికిపోయాడు. సంగం పుట్టేనాటికి అమ్మగా మిగిలిన ఈ ఎనమిదెకరాల్ని పూర్వంనించి దున్నుతున్న లచ్చునికీ, బైండ్లరాజునికి సాతారపు పోషయ్యకు తలా ఎకరం చెందాలని మిగతా భూమి పంపకం తర్వాత చేద్దామని సంగం నిర్ణయించింది.

సంగం అందులో నారుపోస్తే పోలీసు క్యాంపు వేయించి విచ్చలవిడిగా అరెస్టులు చేసి కేసులు పెట్టారు. రెన్నెల్ల తర్వాత కొంత అలజడి తగ్గినట్టుండడంతో పోలీసు క్యాంపు వెళ్ళిపోయింది. ముఖ్యంగా అసలు దొర ఊళ్లో లేకపోవడం, పట్వారి పినాసితనం, క్యాంపు పోలీసులకు మర్యాద చేసేవాడు లేకపోవడంవల్ల పోలీసులు ఈ క్యాంపులో సుఖం లేదనుకున్నట్టున్నారు.

సంగం నిర్ణయించిన పొలాల్లో పరికోతను సంగం చేపట్టింది. మూడువందల మంది ఎర్రజెండాల్తో వూరేగింపుగా వెళ్ళి పంటకోశారు.

ఆరోజు సంగం సంరంభం జరుపుకుంటుంటే పట్వారి ముఖంచూడాలి. ప్రాణం వుండగా తోలు కమిరించినట్టు బొబ్బలేస్తూ ఎగిరాడు, ఒక్కడుగా ఏమీచేయలేనని తెల్సుకుని రఘుపతి దొర వద్దకెళ్ళి మీరు పూనుకుంటే యిద్దరిభూములూ దక్కుతాయి లేకపోతే సీశ్మారగించి దండంబెట్టాల్సిందేనని మొరపెట్టుకున్నాడు. అన్నింటిని వోపికగా విన్నాడు రఘుపతి. ఓపికపట్టాలి అన్నాడు. అంతా మీదయ అంటూ వచ్చేశాడు పట్వారి.

కొద్దిరోజుల్లోనే పోలీసులురావడం సంగపోల్లందర్నికొట్టడం, ధాన్యాన్ని బావుల్లో పారబొయ్యడం బిందెలు చెంబులూ సూటుకేసులు సమస్త సామాను పగల గొట్టినాశనం చేసిపోవడం కొందరిని తీసుకుపోయి కసితీరేదాకా లాకపుల్లో చిత్రి హింసలుపెట్టడం కేసులుపెట్టి జైలుకుపంపడం ఒకటివెంట ఒకటి జరిగిపోయాయి.

గీముసల్దానికోసం పాపం సంగపోల్లంత తన్నులుపడ్డారు. జైల్లకుపోయారు. ఎంతో నష్టపోయారు. అయినా పట్టినపట్టు విడవడంలేదు. తమభూమి తమకు దక్కే దాక వదిలేదిలేదు అంటున్నారు. అందుకే ఎన్నికష్టాలైనా భరిస్తున్నారు.

ఈసారి తమభూమి తమకు రాబోతోంది. ఇకనుండి అందులో పండించిన పంటంతా తమదే, దొర బేసఖలౌతాడు.

ఆ భావం రావడంతో వుత్సాహంతో కాలు నిలువడంలేదు. తన సంతోషం పదుగురిలో పంచుకోవాలని మనస్సు పురకలువేస్తోంది. తలుపు దగ్గరికివేసి బయటకు నడిసింది. రంగయ్య వారిస్తున్నా వినకుండా బండరాళ్ళ చప్పుడువేపు నడిసింది.

తెలతెలవారుతోంది. తూర్పు వేపు వెలుగురేకలు విచ్చుకొంటున్నాయి. శంకరయ్య స్వయంగా మోస్తూ ఏర్పాట్లు పర్యవేక్షిస్తున్నాడు.

అందరూ ఎంతో వుత్సాహంగావున్నారు. పని దాదాపు పూర్తికావొచ్చింది. ఎవర్నీ మాట్లాడిచ్చేట్టులేదు. చకచకా పని చేసుకుపోతున్నారు. అందరిట్లో కలయ దిరిగింది మైసమ్మ.

తనమాట ఎవరూ పట్టించుకునేటట్టు లేరని ఒకింత బాధపడింది, శంకరయ్య ఆప్యాయంగా పలకరించాడు.

మైసమ్మకు ఎందుకో అకస్మాత్తుగ కళ్ళలో నీళ్ల తిరిగాయి. ఆప్యాయంగా చేతులు పునికింది. మాట పెగల్లేదు. కాళ్ల పట్టుకోబోతే వారించాడు శంకరయ్య.

అపుడుగానీ జనం గమనించలేదు. అప్పటికి పనికూడా పూర్తికావడంతో వారిచుట్టు చేరారు. అలా తెల్లవారాక అందరు యిళ్ళకు చేరారు

* * * *

ఎపుడు పంచాయతీకి వెళ్ళడమా అని ఆదరబాదరగా పని ముగించుకొని మనుమరాల్ని తీసుకుని బయల్దేరింది మైసమ్మ.

ఆ చెట్టుకింద అదివరకే కొంతమంది జమఅయి ముచ్చట్లాడుతున్నట్టున్నారు. అందులో ఎన్నో విషయాలు దొర్లుతున్నాయి.

ఆ వూళ్లో సంగంపుట్టి దాదాపు ఎనిమిదేళ్ళయింది. ఈ ఎనిమిదేళ్ళలో దొరల్ని యిలా ప్రజా పంచాయతీకి పిలువడం యిది పన్నెండోసారి. ఇన్ని కట్టుదిట్టాల్తో పంచాయతీ జరపడం యిది రెండోసారి.

ఆవూరు రాగలిగే మరో రెండు బాటల్ని కూడా రాలేకుండా మూసేసారు. టెలిఫోను పలక్కుండా చేశారు.

ఎవరో సైనుబనీను నెక్కరు వేసికొన్న పిల్లవాడు చేతిలో కర్రతో అటుయిటు తిరుగుతూ ఏదో తీవ్రంగా అరుస్తున్నాడు. ఆ కొద్దిసేపట్లోనే జనం గుంపులు గుంపులుగా వచ్చేసారు. తిట్లు, శాపనార్థాలు, ముచ్చట్లు ఏకకాలంలో నడుస్తున్నాయి.

'ఎహె కాళ్లేతులు యిరుగగొట్టాలె' ఎవరో గుంపులోంచి అరుస్తున్నారు.

'పసరాదువిరి! లొల్లిపెట్టకురి!' చంద్రయ్య కసిరాడు. ఏదో అరుస్తుంటె ఓ పిల్లవాన్ని ఒక్కటేశాడు ఆ తల్లి 'ఏం పోకటచ్చిందిరో' అని ఈసడించింది. అంతా అంగడి అంగడిగా వుంది ఆ అరుపుల్లో ఎవరు ఏంమాట్లాడుతున్నారో విని పించడం లేదు.

అక్కడకు సర్పంచు, పట్వారి, రఘుపతి మిగతాఇరుపరు చిన్న భూస్వాములు చేరింది ఎవరూ గమనించినట్టులేదు. అభిమానం సగం చచ్చింది రఘుపతికి.

'ఎవరో దొరలొచ్చిన్రు' అన్నారు.

"ఎవనికిరా దొర?" ఎవరిదో మరొక కంఠం విన్పించింది. లొల్లి మగ్గింది.

దొరలు ఇంకా నిలబడేవున్నారు. పదేండ్లకింద తప్పుల పంచాయతికి ప్రజల్ని దొరలు పిలిపిస్తే ఎట్ల గజగజ వణుక్కుంటూ నిలబడేవారో రంగయ్య మనస్సులో మెదిలి పెదవులపై హాసరేఖ వెలిగి మాయమైంది.

శంకరయ్య చంద్రియ్యతో ఏదో చెప్పగానే చంద్రియ్య మరో యిద్దర్ని తీసుకొని బయటకు నడిచాడు. అందర్ని కూర్చోబెడ్తున్నాడు శంకరయ్య.

'కూసో! కూసో!' రఘుపతి దొరను గుంపులోంచి ఎవరో ఏకవచనంతో అవ హేళన చేశారు. దొర ముఖం వాడిపోయింది. బీరిపోయాడు.

'ఇంత తటపటాయిస్త దేంరా? నీకూ ఆ బండకు రుణపాత్కం ఈనాటిదా! కూసో! చర్నాకోల కొస చటుక్కున తాకినట్టుంది. అలాగే నిలబడితే యింకా ఎన్ని వినవలసి వస్తాయోనని కూర్చున్నాడు దొర. అల్లరి కొంతమగ్గింది.

ఇదే సమయమని కోమటి గోపన్నలేచాడు. 'నేను అందరికి కావలసినమాట జెప్తున్న. బావులకు, కరెంటుమోటర్లకు, ఎరువులకు మొదటినుండి అప్పులిప్పిచ్చి పల్లెను పచ్చగ జేసిందెవలు? అపుడు గీసంగాలేదవోయిసై?'

అందులో పట్వారి ఏదో మాటకలపబోయాడు. ఎవరో తుపుక్కున వుమ్మి వేసినట్టయి అది తనముఖంమీదేపడ్డట్టు వులికిపడి తువ్వాలుతో చెమటతుడుచుకున్నాడు. నోరుమూసుక్కూర్చున్నాడు.

ఆగి గోపన్న మళ్ళీ అందుకున్నాడు. 'మనూల్లె బతుకుతున్నంత పచ్చగ ఏ వూల్లెబతుకుతున్నరో ఒక్క వూరుసూపియ్యనీ. అదంతా ఈదొర పుణ్యంకాదా! పుణ్యాత్మునిమీద కత్తిగట్టిను. అవ్వల్ల గిదేంన్యాయం?' నోరునొక్కుతున్నాడు.

'ఎంత పుణ్యాత్ముడో అందరికి ఎరికేగని చెప్పిందాన్నె రికాంలేకుంట ఎన్ని సార్లు జెపుతరు? వినెటోల్లు ఎంతకని వింటరు? కొత్తగ ఏదన్న చెప్తెచెప్పుని' అసహనంగా అన్నాడు రంగయ్య.

'మొన్న గంతమందిని జేలుకుపట్టిచ్చి పున్యంగట్టుకొలేదా' ఎవరో గుంపు లోంచి కేకవేశారు.

'సీయవ్వ! యియ్యాల దొరనుగోసి పియ్యకూర అండుతరంటివిగదనె! యింకెప్పుడే' మైసమ్మ వుదయాన వుత్సాహంలో మనుమరాలుతో అన్నమాటని సాగదీస్తోంది.

ఆరెండుమాటలూవిన్న రఘుపతి ఆరికాళ్ళలో వణుకుప్రారంభమైంది. జేబులోకి చేయిపోనిచ్చాడు. లైసెన్సుడు పిస్టల్ మునివేళ్ళలోనుంచి గుండెకు ధైర్యాన్ని సరఫరా చేయడం మొదలెట్టింది.

'బొంతచింపులు గతిలేనోనికి గంతభూమి ఏడికెల్లి అచ్చింది. దొంగలెక్క-లొన్ని నిలేపి అడుగునిరి.' గొండ్ల పోచి రోషంగా అంది.

అవి పట్వారి గుండెల్లోకి సూటిగా దూసుకుపోయాయి.

'నాది! నాదే! పట్టాభూమే' అంటూ వుగ్ర నరసింహావతారం ఎత్తాడు

'ఎవలదగ్గరగొన్నవు బాంచెన్ బైండ్ల రాజడు వెక్కిరింతగా అడిగాడు.

'నేను గంగలవడి సంపాయించిన గోదాట్లవడి సంపాయించిన గదంత మీకెందుకు? అది పట్టాభూమా! కాదా! ఓసారి కాయిదాలమీద సూసుకోనిరి!' అని ఏదో కాగితాలకట్ట తీయబోయాడు.

'నీ కాగితాలకట్ట నువుపోగేసుకో మాకెందుకు' నడ్డిముక్కు మైశి అందుకొంది 'నీకు అన్నంబెట్టినచేతులకు సున్నంబెడుతావుర, నాకొడుకును పట్టిత్తావుర.'

జీపు చప్పుడు వినబడడంతోనే చంద్రియ్య ఆదరబాదరగా పరిగెత్తుకుంటూ వచ్చి అక్కడికి మెల్లగాచేరి శంకరయ్య చెవిలో 'జీపుచప్పుడైంది పోలీసులస్తున్నట్టున్నరు' అన్నాడు.

చంద్రియ్య రావడంతో రంగయ్యని బయటకు పంపాడు శంకరయ్య ఏదో తేల్చుకురమ్మని. 'పోలీసుల్నిపిలిస్తే మర్యాద దక్కదు అని దొరలకు హెచ్చరించే వుంచారు. పోలీసుల్నిపిలిచే ధైర్యం వారికి లేదులే! అయినా తొందరగా ముగిద్దా'మని వుంది శంకరయ్యకు. కాని అది బైటికి తెలీకూడదు. ఏంచేయాలో, ఎలాచేయాలో అర్థంకాక కొంతసేపు అయోమయంలో పడిపోయాడు.

పట్వారికి కోపం ఆగడంలేదు. 'మాపొలాలు కోతకచ్చినయి కోస్తరు. కల్లంల ఒక్కిత్తులేకుంట జేస్తరు. మల్ల మీరే దబాయించి అడుగుతునారి! గది చెయ్యంగ ఎరుక లేదా!' కోపం వుద్రేకంతో వణుకుతున్నాడు.

మైసమ్మ అందుకొంది. 'ముప్పయ్యేండ్లవట్టి మాత్రం ఎవలుజేత్తున్రిబాంచెన్'

గుంపులోంచి ఎవరో పడిసెలరాళ్ళలామాటలు విసిరారు 'గట్లడుగునిరి లంజ కొడుకును, గుణమస్తది. ఇన్నేండ్లపట్టి దుక్కులు సాల్లు దున్నిందెవలు? గొర్రు గొట్టిందెవలు? నాట్లేపిందెవలు? కోతలు కోపిందెవలు? బంతులు గట్టిందెవలు? అడుగున్రి!"

'మీరేరా!' ఒక చిన్నదొర వెటకారంగా అన్నాడు.

'మరి యిపుడుమాత్రిం గవన్ని జేసిందెవలు' లచ్చయ్య నిలదీశాడు.

'మీరే! మీరేరా!' పండ్లు కొరికాడు పట్వారి.

'మరి మొప్పయ్యేండ్లవట్టి గిట్ల పని జేత్తనేవున్నం. ఏ లొల్లిలేదు. గిపుడెట్ల పోలీసులకు వట్టిచ్చిన్రు?' చందిరయ్య అమాయకంగా అడిగాడు.

'అవు! పాపం! గట్ల జేసేది లేకుండె! మీగోస తగులుతది....చా....చా....' మరో దొర వెటకరించాడు.

'నాపంట! నాపొలం! నాపడ్లు!' పిచ్చిగా అరుస్తున్న పట్వారికి గుండెలో తట్టు కున్నట్టయింది. తెగ దగ్గుతూన్నాడు.

'పోలీసుల్తోటి బావులల్ల పారబోయిచింన్రి గద! మాయిగూడ మీరే ఎత్తుకచ్చు కోన్రి. తాడుదేపోరి. నడుంకుగట్టి బాయిలకు విడుద్దాం. నీల్లల్ల దేవుకచ్చుకుంటడు'

'మా నెత్తుర్లు పొలాలల్ల చిమ్ముతుంటె గట్టుమీద గూసుండి బొర్ర వెంచిన్రు. ఇంకసాలదా! ఆ జేబుల పిస్తోలుతోటి మా కడుపు కాల్చినట్టు మమ్ముల గాల్చున్రి! మా పేరుమాప్రున్రి! మీరే బతుకున్రి! దొరా మీరే బతుకున్రి! మైసమ్మ ఆవేశంగా వూగిపోతోంది.

అందరివేపు చూస్తూ అన్నాడు శంకరయ్య. 'నడువున్రి ఎహే! ఎక్కడోల్లక్కడ పీకున్రి! యింకేమున్నదీడ! ప్రిజా పంచాయతి అంటె దొరలు జెప్పినట్టు యిన్నంత యిగ! ప్రిజలెందుకు పీకనా! పీకున్రి! ఎక్కడోల్లక్కడ! వూల్లె వుండాలనుకుంటె జెల్ది తప్ప జేయున్రి! వూకె వూకె అనుకుసుటానికి యిదెవలకు కొత్త! ఇది రెండో మీటింగు- చెప్తె జెల్ది చెప్పున్రి! లేకపోతె లేసిపోతం' ఆవేశంలోకూడా నిబ్బరం చూపించాడు శంకరయ్య.

చంద్రయ్యరావడం గుసగుసపెట్టడం ముఖకవళికలు మారడం రఘుపతి గమనిస్తూనేవున్నాడు. బహుశ పోలీసులు వస్తూవుండియుండవచ్చు, మరో ఆర్నెల్లదాకా సజావుగా సాగాలంటే యిక్కడున్న ముఖ్యుల్ని కూడా అప్పగిస్తేసరి. ఆలోగా అన్నీ అమ్ముకుపోవచ్చు, అందుకోసం పోలీసులు వచ్చేదాకా సంభాషణ సాగదీయాలనుకున్నాడు.

'అయితే ఆఖరుకు నాభూమికి ఏ ధర కట్టిద్దామంటున్నరు'

'ఎకరానికీ మూడువేలు'

'పదిహేనువేలకు తక్కొవుండది. మూడువేలకు ఎట్లయియ్యాలె మీరే చెప్పునిరి.'

"నేను వున్నొక్క పొలం కాల్వకిందవోయి మొత్తుకుంటె సర్కారు గంతే ధరగడ్తదిరా అన్నముచ్చట మర్చిపోయినవా కొడుకా' ఎవరో నిలవేశారు.

అలా చర్చఅనంతంగా సాగుతోంది. కాలం పరుగెడుతోంది.

'మరి పట్వారి భూమికి ఎంత ధరగడ్తరి' అడిగాడు సర్పంచు.

'బజ్జెబూరు'

ఆ జవాబిన్నాక తాను నోరు తెరవడమే తప్పనుకున్నాడు. కొరివితో తల గోక్కోవడం ఎందుకు?

అరెస్టయిన వారిని విడిపించే చర్చవచ్చింది· రఘుపతి ఆ అరెస్టులతో తనకు సంబంధం లేదని బుకాయించాడు. రఘుపతి దొర ఎక్కడ తనపైనెట్టుతాడో నని పట్వారి గజ గజవణికిపోయాడు.

'సరే! ఎవరువట్టిచ్చినోరి చర్చపెట్టుకుంటె యిపుడు వచ్చేదేముంది? మొన్న పంచాదికి పిలిసినపుడే చెప్పినంగద! మమ్ముల అడువులువట్టిత్తె మిమ్ముల గదే పనిజేత్తం! అదియాదికుంచుకోనిరి!యిపుడు వాల్లకు బేలు తియ్యాలె. జమానతులు యియ్యాలే. కోర్టుకర్చులు పైకరుసులు అన్నీ మీరే పెట్టుకొవాలె. జమానతులు మీరే యియ్యాలె. ఆయెటి (వర్షాకాలం) పూనుతున్నది. మీరీపని జేయ్యకపోతే మేం ఎంత కూలిచ్చినా పనిజెయ్యం - యింకోరినిచెయ్యనియ్యం, పట్వారి భూమి, దొర భూమి పంచాయతి తప్ప అయిపోయినట్టే మల్లదాన్ని తిరుగదోదేదిలేదు.' అందరు చెప్పిందాని సారాంశం వివరించాడు శంకరయ్య.

మళ్ళీ తర్జన భర్జనలు చెలరేగాయి.

చూసిరాను వెళ్ళిన రంగయ్య వచ్చి శంకరయ్య చెవిలో ఏదో చెప్పాడు. అది సారాజీపని, పోలీసు జీపు కాదని అది అటే వాపసు వెళ్ళిపోయినట్టు తేల్చుకొని వచ్చాడు.

దాంతో శంకరయ్య ధైర్యం పుంజుకున్నాడు. చర్చ తారస్థాయికి చేరింది. రఘుపతి దొర పిస్తోలుకోసం మరోసారి జేబుతడిమాడు.

'మర్యాదదక్కది జాగర్త! యింతమందిమి ఎగవడ్తె నువ్వూ నీపిస్తోలూ మంట్లె కలుస్తరు.' శంకరయ్య హెచ్చరించాడు.

ఎత్తురో బరిసెలు శాని దొంగపెండ్లాం........' లచ్చడు కంక కట్టెతో ఎగిరి ముంగటికి వచ్చాడు.

'తియ్యర! నంచిలకెల్లి!' ఎవరో అరుస్తున్నారు.

'దున్నేవానిదే'........

'భూమీ'

'విప్లవం'....

'వర్థిల్లాలే' నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి.

పరిగెత్తడానికి తయారవుతున్నారు కొందరు. అంతా అల్లరి గందరగోళం. కోపోద్రిక్తులైన జనం రఘుపతి దొర మీద పట్వారీమీద దాడిచేయడానికి సిద్ధపడ్డారు.

,మీ చేతులున్న భూములన్నీ మా చేతుల్లకెల్లి గుంజుకున్నయే వోనాడు. గాభూములన్నీ మాయే! గందుకని పోయినభూములకోసం పోరాటంజేస్తున్నం! గిదన్ల మా పానాలు పోయినా సరే గీపోరాటం ఆపేదిలేదు. మిమ్ముల నిడిసేదిలేదు. ఇన్నూరేండ్లు ఏలిన అంగ్రేజోడే మంట్లె గలిసిండు మీదో లెక్కనా!' ఆవేశంగా సవాలు చేశాడు శంకరయ్య.

ఇంకా రెచ్చిపోతున్న జనాన్ని అతి ప్రయాసమీద నిలుపగలిగాడు శంకరయ్య. లేకపోతే పరిస్థితి మరో విధంగా వుండేది.

భూమి ఎలాగూ దక్కేట్టులేదు. శంకరయ్య మాట మీద ఒప్పుకుంటే కనీసం గౌరవమైనా దక్కుతుందేమోననుకొని చివరకు రఘుపతి విధిలేక ఒప్పుకున్నాడు. ఎక్కడో వుండే దొరనే అంగీకరించాక పట్వారి గుడ్లుతేలవేశాడు. ఆవూళ్ళో బిచాణా ఎత్తివేయాలనుకొంటేనే అంగీకరించకూడదు. బిచాణా ఎత్తేస్తే బయట చిప్పే గతి. మిగతా భూములు కూడా యీవూళ్ళోనే ఉన్నాయి. వాటిని అమ్మనీయరు కొననీయరు కాబట్టి ఒప్పుకోవడమే మార్గంగా తోచింది పట్వారికి.

మిగతా దొరలను ఏమీ అనకపోయినా బుగులు బుగులుగానే వుంది వారికి. అందుకే అట్టే పేచీలేకుండా జమానతు ఇవ్వడానికి వొప్పుకున్నారు. ఎలాగయితేనేం చివరికి పంచాయతీ ప్రశాంతంగా ముగిసింది. ఆరోజు జనం సంతోషం ఇంతాఅంతా అని చెప్ప వీలుకాదు.

*   *   *   *

మైసమ్మ తనకొడుకు వీరయ్య వెంటనడుస్తోంది. మనుమరాలు లచ్చవ్వ వారి కన్నాముందే పరిగెత్తి కొంత దూరం పోయాక ఆగి వాళ్ళు వచ్చేదాకవుండి తిరిగి పరుగెడుతోంది.

పచ్చగా ఏపుగా పెరుగుతున్న మక్క, నువ్వు, జొన్న, కంది చేన్లు పెరండ్లు యిరువైపులా బారులుతీరి, గాలికి కదలుతూ ప్రసన్నంగా పలకరిస్తున్నట్టుగా వున్నాయి.

'యింకెక్కడికిరా!' తన పొలం రావడంతో ఆగిపోయింది అవ్వ.

'అగో! గాయిప్పచెట్టు కనవడ్తలేదా! గదే!' అంటూ చూపిస్తూ విప్పచెట్టు వేపు చూశాడు వీరయ్య.

అదిపరకే కొందరు చేరినట్టున్నారు. మైసమ్మకూడా వారిని చూసింది. 'ఇంకె పలో వున్నరుగదర' మీరు మాట్లాడు కుంటవుండరాదుబిడ్డ. మనపొలం మంచిగా ఏసుకుందో లేదో చూసివస్త. నీ ఎనుకనేవస్త! పా! నువు ముందునడు' అని వీరయ్య జవాబు వినకుండానే తనపొలం వేపు లచ్చవ్వను తీసుకొని నడిపించి.

పొలాల ఆ చివరన పక్కనే వున్న విప్పచెట్టు చేరవచ్చి వెనక్కి చూశాడు వీరయ్య. తల్లి యింకా పొలంకాన్నుంచి బయల్దేరనే లేదు. మోకాలుమంటిబురదలో దిగబడి వంగి ఏదో పరిశీలిస్తోంది. తల్లికి పొలంమీద వున్న మమకారానికి పరవశించి పోయాడు వీరయ్య. లచ్చవ్వ బురదలోకి దిగుతానంటే పొలం పాడైతదని వారిస్తున్నట్టుంది తల్లి

ఆ పొలంకోసమే తన తండ్రి జీవితాంతం ఎలా, ఆరాటపడిపోయాడో! అది ఈనాడు వాస్తవంగా రూపుదాల్చింది. తల్లికి ఆపొలం చేతికి వచ్చిన్నుండీ మనోవ్యాధ లేకుండాపోయింది.

'లాల్‌సలాం కామ్రేడ్' అన్న అన్న పలకరింపుతో తానుకూడా ఆపొలాన్నీ తల్లినీ చూస్తూ మైమరచిపోయాడన్నది గుర్తుకువచ్చింది.

పులికిపడి 'లాల్‌సలాం' అంటూ అందరినీ పలకరించాడు.

శంకరయ్య, రంగయ్య, అన్నతోపాటు కొందరు జైలునించి తనతోపాటు విడుదలైన మిత్రులు కూర్చునివున్నారు.

'కామ్రేడ్: శత్రువు మీమీద ప్రయోగించిన రాక్షస నిర్బంధకాండని చిత్రహింసల్ని తట్టుకుని, సంగాన్నీ, సంగ నిర్వహణకు సంబంధించిన రహస్య సమాచారాన్ని ఒక్కటికూడా శత్రువుకు ఆచూకీ యివ్వకుండా మీ మనస్సులోనే దాచుకుని పదిలంగా కాపాడినందుకు మీ అందరకు విప్లవాభినందనలు.' అని అన్న వారిని అభినందించాడు. అందర్నీ ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

ఒక్కొక్కరు తమ జైలు అనుభవాల్ని పూసగుచ్చినట్టు వివరిస్తున్నారు. కొట్టిన దెబ్బలు, పెట్టినహింసలు యింకా చెరిగిపోని గుర్తుల్ని చూపిస్తున్నారు. ఆప్యాయంగా నిమిరాడు అన్న.

అన్న మాటలు వింటూనే రంగయ్య పొలాలమీదికి దృష్టి సారించాడు.

పొలాలు గాలికి వయ్యారంగా వూగుతూంటే పచ్చని వెన్నెల అలలు అలలుగా ప్రవహిస్తోన్నట్టుగా వుంది. కొన్ని చోట్ల నాట్లు పడలేదు. కొన్ని పొలాల్లో నాటేసిన వరి యింకా వేరూనినట్టులేదు. లేత రంగులో కన్పిస్తోంది.

జైలుకువెళ్ళి వచ్చినవారి మాటతీరు చూస్తుంటే ఏదో తేడా కొట్టవచ్చినట్టు కన్పడుతోంది. జైలుకు పోకముందటికీ యిప్పటికీ వారెంతో ఎదిగినట్టుగా స్పష్టంగా కన్పిస్తోంది జైలుకువెళ్ళిన ప్రతి ఒక్కరూ అట్లనే అవుతున్నారు. ఆకిటుకేమిటో వుండబట్టలేక అడిగారు ఎవరో:

'విప్లవకారుడు ఎక్కడా సమయం వృధాచేయడు. ఈ నిర్బంధ పరిస్థితుల్లో మనకు జైలే ఒక రాజకీయ పాఠశాల. అరెస్టయిన సీనియర్ కామ్రేడ్లు రోజూ ఏదో ఒక అంశంమీద క్లాసు తీసికొంటుంటారు' వివరిస్తూ అన్న, రంగయ్యవేపూ, రంగయ్య చూస్తున్న పొలాలవేపూ చూశాడు.

ఆ పొలాలు. పచ్చని పైరండ్లు, ఎక్కడా మట్టి కన్పించకుండా పచ్చగా పెరిగిన గడ్డి. ఏవేవో చిన్నచిన్న అడవిపూలచెట్లు, ఆ దృశ్యం ఎంతో ఆహ్లాదకరంగా వుంది. ప్రకృతి ఎంత సహజంగా అందంగావుందీ! తనశ్రమశక్తితో ప్రకృతి అందాల్ని మానవుడు మరింత తీర్చిదిద్దినట్టుగావుంది. అనిర్వచనీయ ఆనందంతో పొంగిపోయాడు అన్న.

రంగయ్య దృష్టి సారించి అన్నవేపు చూశాడు. కాంతులీనుతున్న ప్రకృతి దృశ్యంయింకా చెదరిపోనట్టుంది. కళ్ళుచెదరినట్టయి ఒక్కసారిగ తనకొడుకు తనకళ్ళె దుట సాక్షాత్కరించినట్టయింది. కలో! నిజమో! తెలియని వుద్వేగానుభూతుల్తో తన కొడుకే తనకు అన్నయి పాఠం చెపుతున్న అనుభూతిలో ఒకక్షణం పుత్రోత్సాహంతో పులకరించిపోయాడు. సంతోషం దుఃఖం జమిలితో కళ్ళనీళ్ళు నిండాయి. అన్నపై చేతులువేసి చెంపలు భుజాలు నిమిరాడు.

'ఏందె' అంటూ ఆప్యాయంగా రంగయ్య కౌగిలిలో ఒదిగిపోయాడు అన్న.

'ఏంలేదు' అని కళ్ళు తుడుచుకుని తనను సంభాళించుకుని కళ్ళు తుడుచు కున్నాడు రంగయ్య. అతండ్రి పేరిమకు విచలితులయ్యారు. వాతావరణం కొద్దిక్షణాలు గంభీరంగా వుండిపోయింది.

'మనం భూస్వాముల్తోటి మిలాఖతైనమట! కొందరు నన్ను ముఖం మీదనే అన్నరు. ఏంజెప్పాల్నో తోయలేదు. జేల్లవుండి వచ్చినోల్లం. ఇవుతల ఏం జరి గిందో తెల్వదాయె' జైలునుండి విడుదలైన కామ్రేడు సంశయనివృత్తికై అడిగాడు.

'ఏమున్నది! మనం దొరలను కొందరికి జమానతు పడమన్నం గద! గంత మందికి ఒక్కొక్కల్లకు ఇద్దరేసి జమానతుదార్లు కావాలె. భూములు జాగలున్నోల్లు మన సంగంల గంతమంది ఎక్కడున్నరు? తాగినోదె గత్తరు తాల్లపన్ను. కోర్టు కచ్చెల్లో కూడ సగం వాల్లు ఇచ్చుటానికి ఒప్పిచ్చినంగద! ఇగ గందుకు మనలందర్ని దొరల యిండ్లల్ల తింటన్రు. దొరల ఇండ్లల్లనే వుంటన్రు- దొరలే ఈల్లకు పైసలి త్తన్రు- దొరలకు ఈల్లుఏజంట్లు, గులాంలు, గుండాలు అనిగుడ అంటరు- అంతేనా' శంకరయ్య ఆ కామ్రేడ్ వేపు చూశాడు.

'అబ్బ నిజంగనే! నాతోటి మాసిన్నాయిన యింటికి పోయినకాడ గాయినె అచ్చం గిట్లనే అన్నడే' తన బాధ పూర్తిగా ఎదుటివాడికి అర్థమైనందుకు వుల్లాసపడి పోయాడు.

'మనం చేస్తున్న పోరాటాలు, సాధిస్తున్న విజయాలు చూసి అసూయ తోటి కొందరు గట్లనే అంటరు.' అన్నాడు శంకరయ్య.

'అదిగాదే శంకరన్నా! నిజంగనే! ఎవలన్న అడుగుతె ఏంజెప్పుదే?' అని ఆ కామ్రేడ్ అన్నవేపు సాభిప్రాయంగా చూశాడు.

'మనను కిందికి తొక్కి పైకిపాకిన దొరలను ఆపై మెట్టుమీంచి తిరిగి కిందికి తీసుకరావాలె. మనపోరాటాలు పెరిగినాకొద్ది మనధైర్యం పెరుగుతున్నది. సంగంఆజ్ఞలను దొరలు పాటించేట్టు చేయడం మనం సాధించాల్సిన విజయాలు. అవి మనం సాధిస్తున్న విజయాలు కూడా! మనఆజ్ఞల్ని దొరలు పాటిస్తున్నరంటె అర్థమేంది? మన సంగానికి లోబడి అణగిమణగి వుండడమన్న మాట! ఏ సంగానికైనా యింతకన్న గొప్ప విజయం ఏముంది? ఇదే అసలు విజయం' అని వివరించాడు అన్న.

అలా కొంతసేపు వివిధ అంశాలపై చర్చ జరిగింది.

'అవు అన్నా! దున్నేటోనికే భూమి యింకెన్నడైతది. పాలేర్లజీతాలు, కూలీల పెరుగుడుకోసం. బంజెర్లు, దండుగుల వసూల్లు గుంజుకున్న భూముల్ని మల్లదీసుకునుడు గిట్ల పోరాటాలు మాజేస్తున్నంగని! అసలుపోరాటం యింకెన్నడుమొదలైతదే' ఎవరో అడిగారు.

'ఎప్పట్నుంచో గలాంటి పోరాటాలు మొదలై కొనసాగుతంటె కొత్తగా గట్లడుగవట్టి వేంది కామ్రేడ్! మీరు మొన్నజేసిన పోరాటం ఏంటిది?' అని లాలనగా అడిగాడు అన్న.

'నువ్వేమంటున్నవో నాకు సమజైతలేదే!' ఆశ్చర్యపోయి అడిగాడు.

'మీరు మొన్నసాధించిందేంటిది? పట్వారి ఆక్రమించిన ఎనిమిదెకరాలు, దొర ఆక్రమించిన పొలం మళ్ళీ తిరిగి సంగం అధ్వర్యంలో ఎవరిదివారికి పంచలేదా! ఇదేమైన తక్కువ విజయం అనుకున్నారా!' అర్థోక్తిగా ఆగాడు అన్న.

'అవునిజమే! అయితే....?' ఆ కామ్రేడ్ అడుగుతున్నది నిజమేనన్నట్టుగా ఆసక్తిగా, ఆశ్చర్యంగా, అన్నను చూసారు కొందరు.

'ఎవలభూమి వాల్లకు సంగం యిప్పించినంక యింక దొరలదగ్గర భూమెక్కడవుంటది?'

'ఎట్ల?'

'దొరల దగ్గరున్న భూమంత ఎన్నడో ఒకనాడు ప్రజలదగ్గర్నుంచి గుంజుకున్నదే గదా! వాల్లకు స్వంతం భూములంట యింకెక్కడియి?' అంటూ పరాయీకరణ జరిగిన క్రమాన్ని వివరించాడు అన్న.

'వోర్నియక్కా! కండ్లుండిగుడ్డోల్లు అంటే గిదేనేమో! అన్నజెప్పేదాక మనకు తోయకనేపాయె! నిజమే' అన్నాడు. ఆ కామ్రేడ్పు ఆశ్చర్యం మరియు తాము సాధించిన విజయాల పట్ల గర్వంతో తబ్బిబ్బయిపోయారు వారు.

ఒక్కొక్కరు సెలవు తీసుకొంటూ వెళ్ళిపోతున్నారు. చెట్టుకింద అన్న, శంకరయ్య, రంగయ్య, వీరయ్య మాత్రమే మిగిలారు.

*      *      *      *

'అవ్వ యింక రాకపాయె!' అన్న వీరయ్య వైపు చూశాడు. వీరయ్య పొలాల వేపు చూశాడు. అన్న కూడా అటువేపు దృష్టి సారించాడు

ఇటీవలి వర్షానికి కరిగిపోయిన కొత్తవొడ్లని పునర్నిర్మిస్తున్నట్టుంది మైసవ్వ.

'రైతుకు భూమి అంటె, పంట అంటె ఎంత మమకారమో సూడు. మనం యిక్కడున్నమని తనకోసం ఎదిరి చూస్తున్నమని మర్చేపోయింది. తన కష్ట ఫలితం తనకే చెందుతున్నపుడు కష్టజీవి కష్టంలోనే ఆనందం పొందుతడు!' అంటూ తనకు ఆలస్యమౌతున్నదన్న విషయం మరిచి పోయి పరవశించిపోయాడు అన్న.

'అవ్వను జెల్ది రమ్మనుపో ఆలస్యమైతంది. ఆక్కడ ఎదిరిచూస్తరు. జెల్దిపో' తేరుకొని మళ్ళీ అన్నాడు అన్న.

'అబ్బా! అది నేనుపోతె వత్తదా! నాకంటె దానికి పొలమే ఎక్కువ.' అంటూ వీరయ్య రంగయ్యను చూపాడు.

'రంగన్నా నువుపోతే వస్తదే' అన్న సూచనగా అనడంతో నవ్వుతూ లేచాడు రంగయ్య. లచ్చవ్వను అక్కడేవుంచి మోకాళ్ల వరకు అంటిన బురద చేతులంతా బురదలో అలాగే వచ్చింది మైసమ్మ. ఈ లోకాన్నే జయించినంత సంతోషం, విశ్వాసం, గర్వం అవ్వలో తొణికిసలాడుతున్నాయి. పలకరింపులు పూర్తయ్యాక అసలు విషయంలోకి వచ్చాడు అన్న.

'అవ్వా మరి వీరన్న నీకేదో చెప్పిండట గదనే'

'నాకేంజెప్పిండు! అన్న ఏదో చెప్తనన్నడు రాయే అన్నడు'

'నాతీరు రైతాంగ కార్యకర్తగ పనిచేస్తనని అన్నడు- వున్నదే వొక్క కొడు కాయె ఏమంటవో నిన్నగుడ విచారిస్తె మంచిదిగదనె'

'నేను అడ్డంటె ఆగుతరా!' ఇదంతా అవ్వ మెప్పుకోసం చేస్తున్న మర్యాద అని వారి ముఖం చూస్తేనే తెలుస్తుంది.

ఎప్పట్నుంచో అనుకొంటూనేవున్నా, గుండె రాయిచేసికోవాలని ఎప్పటినించో ప్రియత్నిస్తున్నా మైసమ్మకు దుఃఖం ఆగలేదు. తన కొడుకుని తనలాగా జీవితాల పర్యంతం దోపిడి చేయబడ్డ వాళ్ళ బతుకుల బాగుకోసం పోరుపథంలో నడపడానికి వెళ్తున్నాడన్న వూహ యింతకు క్రితందాకా ఎంతో సంతోషాన్ని గర్వాన్ని కల్గింప జేసింది. తన జన్మ ధన్యమైందనీ అలా వెళ్ళడం తనకు గర్వకారణమనీ మురిసింది. మనుమరాలి తోడుతో శేషజీవితం గడపగలనని నిర్ణయం చేసికొనివుంది.

అందరు మెచ్చిన పిల్లవాడితో ఎంతో సంతోషంగా కూతురి పెళ్ళి నిర్వహించి అప్పగింతల కార్యక్రమం మొదలయ్యేసరికి పెళ్ళి పందిరంతా విషాద ఛాయలు అలుముకున్నట్టుగా వుంది అవ్వకు.

చిన్ననాటినించి కష్టాల్లోనే పుట్టి పెరిగిన కొడుకు జీవితమంతా కళ్ళముందు కద లాడింది. కొడుకు ఎన్నడు సుఖపడ్డాడని! ఈ పేదదాని కడుపులో పుట్టి ఎన్ని బాధ లనుభవించాడు. దారిద్ర్యాన్ని మించిన బాధేముంది ప్రపంచంలో.

తన కొడుకు నేటినుండి దరిద్రుడు కాడు. వానికి కోట్లాది పేద ప్రజల అండ వుంది. వాన్ని తమ ప్రాణాలు ఎదురొడ్డి కడుపులో దాచుకుంటారు ప్రజలు.

కాని తన చావుకైనా అందుతాడో లేదో! సంగపన్నలంతా తన కొడుకు లైనాక తనకు యింకా యీ చింతలేమిటి!

అలా వివిధ భావ సమ్మిశ్రితమైన దుఃఖం వుద్వేగంతో అవ్వ కళ్ళలోంచి టపటప చీరకొంగుపై కన్నీటి బొట్లు రాలి యింకిపోయాయి.

రంగయ్యకు కొడుకు కళ్ళల్లో మెదలి కను కొనుకుల్లో నీళ్ల నిలిచాయి. వారిని చూసి అక్కడున్న అందరికి కనుగుడ్లల్లో నీళ్ళు నిలిచాయి. ఎవరూ ఎక్కువగా మాట్లాడలేకపోయారు. కళ్ళనీళ్ళు తుడిచాడు అన్న.

ఎంతోసేపటికి తేరుకుంది అవ్వ. కళ్ళ నీళ్ల తుడుచుకుంది. 'కన్నపేగు కొట్టుకుంటది బిడ్డా' అని అన్నని ప్రేమగ కౌగలించుకొంది.

చివరిసారిగా కొడుకును కౌగలించుకొంది.

'మీ అయ్యపేరు నిలబెట్టాలె కొడుకా!' అశ్రుపూరిత నయనాలతో వీడ్కోలు తెలిపింది అవ్వ. రంగయ్య శంకరయ్య భాషలో చెప్పలేని వేల భావాల్ని వాళ్ళ కళ్ళల్లో ప్రతిఫలించాయి.

పిడికిల్లెత్తి లాల్‌సలామ్ చెప్పి అన్న, వీరయ్య తూర్పు దిక్కుకేసి సాగి పోయారు.

# స్త్రీ అరసం అవగాహన?

స్త్రీల సమస్యల పరిష్కారంలో మితవాదం, పునరుద్ధరణవాదం ప్రధానంగా వస్తున్న ధోరణులు. ఈ రెండూ ప్రాచీన సాంప్రదాయాలను త్రోసిపుచ్చుతూనే వాటి సారాంశాన్ని మరో రూపంలో నిలిపి ఉంచడానికి దోహదం చేస్తాయి. ముఖ్యంగా రివిజనిస్టు దృక్పథం అన్ని విషయాల్లో మాదిరిగానే స్త్రీల అణచివేతను అర్థం చేసుకొని పరిష్కారాన్ని చూపడంలో కూడా అన్యవర్గభావాలతో రాజీధోరణి, సాహ రస్యపూరిత మైఖరిని అవలంబిస్తుంది. 1981లో అరసం (ఖమ్మం జిల్లాశాఖ) ప్రచురించిన రెండు పుస్తకాలు స్త్రీ (కవితాసంకలనం), సాహిత్యంలో స్త్రీ (వ్యాస సంకలనం) ఈ విషయాన్ని చక్కగా నిరూపించాయి. ఇందులో రచయితల్ని తప్పు పట్టాల్సింది ఏమీలేదు. ఎందుకంటే హేమలతా లవణంగారిని స్త్రీల సమస్యలకి పరి ష్కారం చూపమంటే "స్త్రీలు నాస్తిక దృష్టిని అలవరచుకొని, శాస్త్రీయజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి ముందుకురాలేక పోయినట్లయితే ముందు తరాలకు కూడా మౌఢ్యం నిండిపోతుంది" (పేజీ 121 సాహిత్యంలో స్త్రీ) అని చెప్పకుండా మరో విధంగా చెపుతుందనుకోవడం పొరపాటు ఆమె విశ్వాసం నాస్తికత్వం కనుక ఆమె అదే చెపుతుంది. మరి అరసానికో- ఈ అరసం వాళ్ళకి మార్క్సిజం పట్లగానీ, స్త్రీ విముక్తి పట్లగానీ స్పష్టమైన, నిర్దిష్టమైన దృక్పథం లేకపోవడం ఈ సంకలనాల్లోనూ కన్పిస్తుంది. ఈ రచయితల్లో కొందరు అరసం సభ్యులు కూడా వున్నారు. వ్యాసాలు రాయించడానికి మంచి శీర్షికలే ఎన్నుకొన్నప్పటికీ ఎంచుకున్న రచయితల ప్రాపంచిక దృక్పథం గురించిన పట్టింపు లేకపోవడం, ఈ సమస్యలపట్ల తమకో నిర్దిష్టమైన దృక్పథం లేకపోవడాన్ని తెలుపుతుంది కవితల్లో స్త్రీల పరిస్థితిని ఎత్తిచూపడం చాలా వుత్తేజపూరితంగా కన్పిస్తుందేతప్ప ఏ మాత్రం అవగాహన లేకపోవడంవల్ల మాతృ త్వాన్ని దాస్యభావాన్ని దాక్షిణ్యభావాన్నీ పదేపదే విపరీతంగా అద్భుతంగా కీర్తించారు.

మాతృత్వాన్ని కీర్తించడం మానవజాతి చరిత్రలో రెండు భిన్న సమాజాల్లో రెండు విభిన్న ప్రయోజనాలకోసం జరిగింది. మాతృస్వామిక వ్యవస్థలో మాతృ త్వానికి అధికారపూర్వక ప్రాధాన్యతకి భౌతిక పునాది ఏమిటంటే మానవుల సంఖ్యాభి వృద్ధికి కారణం, అప్పుడు వాళ్ళకి కన్పించే ప్రత్యక్ష కారణం స్త్రీయే అవడం. తర్వాత పితృస్వామిక సమాజంలో పురుషుడి ఆస్తికి అర్హులైన వారసుల్ని కని పెంచే ధర్మాన్ని స్త్రీకి నిర్దేశించిన క్రమంలో కూడా స్త్రీ మాతృత్వాన్ని కీర్తించడం వుద్దేశ్య

పూర్వకంగా జరిగింది. మొదట కీర్తన వుద్దేశ్య రహితమైనదైతే రెండవది పిత్రు స్వామ్య వ్యవస్థను కాపాడుకునే ఉద్దేశ్యంతో కూడుకున్నది. ఈ క్రమంలో వచ్చిన భావజాలం, మాతృత్వం (వరం)— గొడ్రాలు (తిట్టు) క్షమయా ధరిత్రీ, సహనశీలి పతివ్రత, భూదేవి వగైరా భావ జాలం. ఏ రూపంలో వచ్చినా ఈ ధోరణులన్నీ కేవలం స్త్రీని పునరుత్పత్తి యంత్రంగా, వస్తువుగా తప్ప పరిపూర్ణ మానవిగా గుర్తించడానికి, ఎదగడానికి దోహదం చేయవు. ఈ క్రమానికి మన దేశంలో వేదకాలం లోనే అంకురార్పణ జరిగింది. ఐతే మధ్యయుగాలనాటి దుర్మార్గం కనిపించదు గనుక వేదకాలంనాడు స్త్రీల పరిస్థితి బావుండేదని చాలామంది భావిస్తారు. ఈ ధోరణి ఒక స్త్రీ సమస్య పట్లనేకాదు- హిందూ సంస్కృతిలో వివిధ విపక్షల (కులం, మతం వగైరా) పట్ల కూడా జాతీయ పోరాటకాలం నుంచి ముఖ్యంగా తిలక్‌నుంచి "చాదస్తపు" (సంప్రదాయ) కమ్యూనిష్టుల దాకా ఇంకా ఎట్లా కొనసాగుతూ వస్తూనే వున్నదో ఈసంకలనంలో రాచపల్లి ప్రతిసప్త గారి "ధర్మశాస్త్రాల్లో స్త్రీ" చదివి అర్థం చేసుకోవచ్చు. "మనమంతా బూర్జువా సమాజం, పెట్టుబడిదారీ సమాజం స్త్రీహక్కుల నన్నిటినీ అపహరించి (పేజీ-13 — సాహిత్యంలో స్త్రీ) స్త్రీని ఒక అబలగా, పరాధీనగా చిత్రించి ఒక బానిసగా, యంత్రంగా తయారు చేసిందని వాపిస్తున్నాము. ఇది ఎంతవరకు నిజం? (నిజం కాదనే తర్వాతి పేరాల్లో ధృవీకరించాడు) మన ధర్మశాస్త్రాలు స్త్రీకి ఎంత విలువ నిచ్చాయి? ఎందుకిచ్చాయి?" అని అంటూ చివరలో "ఐతే స్త్రీలకిజరిగిన అన్యాయం—అది మన ధర్మశాస్త్రాలవల్లకంటే ఎక్కువగా వాటికి కాలానుగుణమైన వక్రభాష్యాలవల్ల జరిగినదే" (29వ పేజీ) అని తేల్చేశారు. పితృస్వామ్యం స్త్రీని పురుషుడికి అధీనురాలిని చేసింది. పురుషుడి ఆస్తినీ, అతని ఆస్తికి వారసుల్ని కనే స్త్రీపై పురుషాధికారాన్ని పరిరక్షించడానికి సృష్టించిన నియమ నిబంధనలే (చట్టాలే) వేదాలు, వేదాంగాలు, ధర్మశాస్త్రాలు. వీటికి సాంస్కృతిక రూపం ఇచ్చే ప్రయత్నమే పురాణాలు, ఇతిహాసాలు. స్త్రీ మీద అణచివేత, హింస, దోపిడీ పరాకాష్ఠకు చేరిన మధ్య యుగాల స్థితిలో పోలిస్తే—స్త్రీ మీద పురుషుడి ఆధిపత్యం కొత్తగా మొదలైన వేదకాలంనాటి ప్రారంభ పరిస్థితిలో కొంత వెసులుబాటు కన్పించే మాట నిజమే కానీ ఈ ప్రారంభ దశలో స్త్రీల అణచివేతకి మనుధర్మకారుడు వేసిన పునాది ఎంత బలమైనదంటే అది రకరకాల కాలానుగుణ్యమైన భాష్యాలతో "చాదస్తపు మార్క్సిస్టు"ల బుర్రల్లో కూడా దూరి మనువుకన్నా పరాశరుడు నయం, పరాశరుడికన్నా మరొకరు అంటూ ఇక్కడ నాలుగు రకాల అణచివేతల్లో ఏదో ఒకటి ఏరు

కుని – ఇదో. ఇది మెరుగు అనే స్థితికి దారి తీస్తున్నది. ఈ కోవలోనే "యత్ర నార్యాస్తు పూజ్యంతే రమంతే– తత్రదేవతాం (పేజీ-41 సాహిత్యంలో స్త్రీ) అని వేదకాలం వరకు మన దేశంలో స్త్రీ గొప్పగా జీవిస్తూ వచ్చిందే" అని నమ్ముతున్న సంజీవదేవ్ గారు "శిల్పకళలో స్త్రీ" వ్యాసం రాశారు. వీరికి శిల్పకళ గురించి చాలా తెలిసివుండొచ్చు కానీ స్త్రీ సమస్య గురించి తెలిసింది మాత్రం శూన్యం– ఇందులో రచయిత ప్రధానంగా వెలిబుచ్చిన ధోరణి" ప్రతి కళలోనూ స్త్రీకి ప్రాధాన్యంఉన్నది (పేజీ 42,. నిజానికి కళ అనేది హృదయ ప్రాధాన్యం కలది. (స్త్రీలకి హృదయాలు పురుషులకి మేధస్సులూ వుంటాయనే గాఢనమ్మకం!) పురుషునికంటె స్త్రీలో హృదయ ప్రాధాన్యం అధికంకనుక స్త్రీకి, కళకూ సాన్నిహిత్యం అధికం" అంటాడు. ఇంతేకాదు "శిల్పంలో స్త్రీ ప్రాధాన్యం వుండటానికి మరో కారణం ఏమంటే స్త్రీ శరీరంలోని నిమ్నోన్నతాలు లయబద్ధమైన 'వంపు', కళ్ళలోని కమనీయత ఒక విధమైన కావ్య కోమలత పురుషుని శరీరంలో కన్పించవు. "స్త్రీ శరీర నిర్మాణంలోని ఈ వైశిష్ట్యం కళా నిర్మాణానికి కాంతినివ్వడంలో శిల్పుల స్త్రీ-మూర్తులకు తమ శిల్ప సృష్టిలో ప్రాధాన్యతనివ్వడం జరుగుతూవచ్చింది (పేజి 44)". ప్రబంధకవులుకూడా ఇదే ధోరణిలో స్త్రీల తోలువొలచి మరీ వర్ణించారు. ఈ వ్యాసం పక్కనే. ప్రబంధాల్లో స్త్రీల వర్ణనల్ని తిడుతూ 'రావి భారతి'గారి వ్యాసంవేయడం వీళ్ళ గందరగోళానికి సరిపోయింది. ప్రచారసాధనాల్లో, వ్యాపార ప్రకటనల్లో స్త్రీలను వుపయోగించు కోవడాన్ని వ్యతిరేకిస్తూ కృషిచేస్తున్న ఢిల్లీలో ఏర్పడిన ఒక కమిటీని విమర్శిస్తూ "ఇండియన్ ఎక్స్‌ప్రెస్"లో టాంక్‌బండ్ నోట్ బుక్ రాసిన రచయితా, సంజీవదేవ్ గారు శిల్పం విషయంలో ఇదే అభిప్రాయం ప్రకటించారు. "స్త్రీలు అందంగా వుంటారు కనుక ప్రకటనలకు వాడుకుంటారు. తప్పా? ఇప్పట్నుండీ మగవాళ్ళను ప్రక టనలకు ప్రదర్శిస్తే చూసి ఆనందిద్దుకుగానీ" అన్న ఉడుకుమోతు ధోరణిలో రాశాడు. ఎటు తిరిగి ఏటు వచ్చినా వీళ్ల దృష్టిలో స్త్రీ భోగ్య వస్తువు. అంతకుమించి వీళ్ల ఆలోచించరు. ఈ రచయితలకి తాము రాస్తున్న విషయాలపట్ల, తిథివారాల లెక్కల ఘటనల పరంపరకు సంబంధించి వరుసక్రమాల పరిజ్ఞానం ఎంత గొప్పగా వున్నా వీరు చెప్పిన శాస్త్రీయ అవగాహన కానీ మార్క్సిస్టు పరిశీలనా జ్ఞానం గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంతో విశ్లేషించే స్పృహ కానీ కొరవడడం వల్లనే మార్క్సిజానికి ఫ్రాయిడ్‌కి ఒకే విధంగా బద్ధులై తెలుగు నవలా సాహిత్యంలో స్త్రీ పాత్రల చిత్రీకరణ (పేజీ-61) వ్యాసంలో గొప్ప అసంబద్ధ సూత్రీకరణలు చేశారు

ఫ్రాయిండ్ అన్నట్టుగా Castration Complex (ఆత్మ న్యూనతా ధోరణి-ఊళలో కోడెల్ని ఎద్దుకొట్టడం అంటారు- అలా చేసిన తర్వాత ఎద్దు అనుభవించే స్థితి) స్త్రీ విమోచనోద్యమానికి మూలం అవునేమో తెలియదు కానీ కొందరు రచయిత్రిలు "ట్రేడ్ యూనియన్ స్పిరిట్" (పేజీ-70)లో చేస్తున్న రచనలు చూస్తుంటే అందులో కొంత నిజం వుందేమోనన్పిస్తుంది. "పేకమేడలు" "అంధకారంలో స్త్రీ" వంటి రచనలు చేసిన రంగనాయకమ్మ ధోరణి "స్వీట్ హోమ్" నవలలో మరింత స్పష్టంగా కనబడుతుంది. "నీ భారత స్త్రీకి నిప్పెట్టా" "ఆ మాటలలోనే ఎలర్జీ నాకు" అనే విమలలో పురుషద్వేషం కొట్టొచ్చినట్టుగా కనబడుతుంది నాకు (పురుషాహంకారంతో మిడిపిపడుతూ కళ్ళకి పొరలు కమ్మినవాళ్ళకి అట్లాగే కనబడుతుంది.) అంతేకాదు "మగవాడు యెలాంటి గొడ్డయినా ఆరాధనేనా నీకు? నీ మొగుడు ఎక్కడ పడుండు-అతని పెంపుడు కుక్కలా తిరగ" అనే మాటల్తో ఆత్మన్యూనతా భావం బుసలుకొడ్తూ కన్పిస్తుంది. మార్క్సిజాన్ని, ఫ్రాయిడ్‌నీ ఒకేరకంగా జీర్ణించుకునే ఇలాంటి వెర్రి మొర్రి రచయితలకి స్త్రీపట్ల దాక్షిణ్యభావం మాత్రమే- అంటె పాపం వాళ్లూ మనుషులే కదా-వాళ్ళనూ చదుకోనివ్వాలి, వాళ్ళనూ అన్నం తిననివ్వాలి, ఒక మొగుడుచస్తే మరో మొగుడికి సేవచేసుకోనివ్వాలి- అనే స్థాయి మాత్రమే వుంటుంది. అంతకుమించి ఆలోచిస్తే అది ఆత్మన్యూనతాభావం (Castration Complex) అవుతుంది.

శీర్షిక పరంగానూ, సమాచార పరంగానూ అవగాహనలోనూ చివర్లో కొన్ని యాంత్రికమైన సూత్రీకరణలు తప్పిస్తే ఇందులో ఉండతగని మంచి వ్యాసం పర కాల పట్టాభిరామారావుగారి "రాజకీయ రంగంలో స్త్రీ". ఆయాపరిణామాలకి కారణం వివరించకపోయినా చదవతగ్గ మంచి వ్యాసం సావిత్రిగారి "తరతరాల సాహిత్యంలో స్త్రీ". ప్రేమ్‌శీలగారి "స్త్రీలు-సమస్యలు" తలాతోకాలేని అయోమయ వ్యాసం-- ఇలాంటివన్నీ ఒకచోట చేర్చి ప్రచురించడంతో స్త్రీ సమస్యలపట్ల వాళ్ల ధృక్పథాన్నీ అవగాహననూ అర్థం చేసుకోవడానికి ఈ పుస్తకాలు ఉపకరిస్తాయి.

—రత్నమాల

| | | |
|---|---|---|
| సాహిత్యంలో స్త్రీ | — | వెల : రు. 6.00 |
| స్త్రీ - (కవితా సంకలనం) | — | 1.50 |

ప్రచురణ: ఖమ్మం జిల్లా అభ్యుదయ రచయితల సంఘం, సంకలన కర్త—జాతశ్రీ

ప్రతులకు: 1) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, మాచవరం, విజయవాడ-4

2) జాతశ్రీ (సృజనాలయం,) ఇల్లెందు - 507 123, ఖమ్మం జిల్లా

## 'చైనాలో ఏంజరుగుతోంది?'

### సమీక్షావ్యాసంపై సందేహాలు

'సృజన' సెప్టెంబర్ సంచికలో 'చైనాలో ఏం జరుగుతోంది?' అన్న పుస్తకం పై బాలగోపాల్ గారి సమీక్షావ్యాసంచదివాక నాకు కొన్ని సందేహాలు కల్గుతున్నాయి. ఆయననుంచిగాని, పాఠకులనుంచిగాని వీటికి సమాధానాలు దొరుకుతాయేమోనని రాస్తున్నాను.

"చైనాలో ఏం జరుగుతోంది? అన్న ప్రశ్న తన ప్రాముఖ్యతను చాలావరకు కోల్పోయింది చైనాలో ఏం జరుగుతోందో అందరికీ తెలుసు." ఈ మొట్టమొదటి అభిప్రాయాన్ని గురించి ఆలోచిద్దాం. బెతల్‌హామ్ వ్యాసాలు రాసేనాటికీ ఇప్పటికీ చైనాలో వచ్చినమార్పు సందేహాతీతమైన నిర్ణయానికి చేరుస్తున్న మాటనిజమే. అయితే, అది "అందరికీ తెలుసు" అని సులభంగా తేల్చివేయ తగిందికాదు. అందరికీ తెలిసినమాటే నిజమైతే, బెతల్‌హామ్‌లాంటి మార్క్సిస్టులు, ఎడ్గార్‌స్నో లాంటి ఉదారవాదులు సాంస్కృతిక విప్లవాన్ని గురించి ఇచ్చిన చిత్రం ఎంతవరకు వాస్తవమైనదో, ఎంతవరకు కాల్పనికమైనదో తెలీదని సమీక్షకుడికే సందిగ్ధం కల్గేదికాదు.

సాంస్కృతిక విప్లవదశను గూర్చిన సమాచారం పూర్తిగా తెలీకపోవచ్చుగాని, చైనాలో రివిజనిజమ్ ప్రవేశించిందన్న సంగతి స్పష్టంగానే అర్థమవుతుంది కదా అంటే, సాంస్కృతిక విప్లవాన్ని గురించి తెలుసుకుంటేకాని, దాన్ని వ్యతిరేకిస్తున్న రివిజనిజమ్ స్వరూపాన్ని పూర్తిగా తెలుసుకున్నట్టుకాదు. మావోరాసిన 'క్రిటిక్ ఆఫ్ సోవియెట్ ఎకనమిక్స్' అనే పుస్తకాన్ని పార్టీలో చర్చకే రాసివుంటారని, అందులో పునాదిలో మార్పురావలసిన అవసరాన్నిగురించి చెప్పడంవల్లనే, రివిజనిస్టులు సాంస్కృతిక విప్లవాన్ని వ్యతిరేకించివుంటారని సమీక్షకుడు అన్నారు. అందువల్ల సాంస్కృతిక విప్లవానికీ, రివిజనిజానికీ అంతదగ్గర సంబంధమున్నప్పుడు, సాంస్కృతిక విప్లవంగురించివాస్తవంయేమిటో ఇంకా తెలీనిదశలో 'రివిజనిజమ్' మాత్రం 'అందరికీ తెలిసింది' అవుతుందా?

సాంస్కృతిక విప్లవానుకూలురు, వ్యతిరేకులు ఇస్తున్న చిత్రాలనుబట్టి యేది వాస్తవమైందో తెలుసుకోలేకపోతే, చైనాలో రివిజనిజమ్ ప్రవేశించిన సంగతి తెలుసు కోవడం కూడా సాధ్యంకాదు. ఎందుకంటే ఇక్కడా రెండురకాల అభిప్రాయాలు

న్నాయి. ఇటీవల చైనా అన్నిరంగాలలో గొప్ప అభివృద్ధిని సాధించినట్టు తెలిపే సమాచారం తక్కువేమీకాదు. అంతేకాక, రివిజనిజమ్ కూడా ఒకదశతో ఆగిపోయేది కాదు. దాని దిశలో అది ముందుకు పోతూనేవుంటుంది. చైనాలో ఆ పరిస్థితి మారినప్పుడో, ఆ పరిస్థితి పూర్తి పెట్టుబడిదారుగానో, సామ్రాజ్యవాదిగానో, ఎదిగినప్పుడో మాత్రమే 'చైనాలో ఏం జరుగుతోంది?' అన్న ప్రశ్నకు ప్రాముఖ్యత పోతుందని, అంతవరకు వున్నట్టేనని అనుకుంటున్నాను.

రంగనాయకమ్మగారి విశ్లేషణతో తనకు మౌలికంగా విభేదంవుందని, గతితార్కిక భౌతికవాద సిద్ధాంతానికి ఆ విధానం దూరమైందని, అందుకు ఉదాహరణగా పుస్తకంలో (271-72 పేజీలు) మావోభార్యకు రాసిన ఉత్తరం పై ఆమె వ్యాఖ్యలను చదివితే అర్థమవుతుందని అన్నారు. "సరదాకి మాట్లాడే మాటల్లో ఒకదానికొకటి కొంతనవుండకపోవచ్చు. అలా తీసుకోవడానికి యెవరికీ అభ్యంతరం వుండదు" అన్న రంగనాయకమ్మగారు అలా తీసుకోకుండా "మితవాదులకు, విప్లవకారులకు ఉపయోగపడేమాటలుమాట్లాడ తాడుకాటోలు తెలిసే" "విప్లవనాయకుల్లో మార్మికత్వం పెళ్ళాలకు రాసే ఉత్తరాలదాకావెళ్ళింది" అని వ్యాఖ్యలు చేయడం ఆయన అన్నట్టు 'విస్ఫుహ'తో కూడిన ఆక్రోశంకావచ్చు కాని, "ఈ ఉత్తరం పార్టీ డాక్యుమెంట్ ఎలా అయింది?" అన్న ఆమెప్రశ్న నిర్లక్ష్యం చేయ తగిందికాదు. అలాగే "వ్యక్తిపూజ"ను గురించి ఆమెచేసిన ఆలోచన అంతా తోసివేయతగిందికాదు. వ్యక్తిపూజను ఎవరు ప్రోత్సహిస్తారు? ఎవరికి లాభిస్తుంది? అని ఆలోచించినా, చైనాలో జరిగిన వ్యక్తిపూజ దుష్ఫలితం భారతవిప్లవకారుల్లో కూడా ప్రవేశించి మావో మా అధ్యక్షుడు అనే అశాస్త్రీయధోరణికి దారితీసిందన్నది గుర్తుచేసుకున్నా దాన్ని సమర్థించకూడదని గ్రహించవచ్చు. 'గతితార్కిక' దృష్టితో 'వ్యక్తిపూజ' కూడా ఒకదశలో విప్లవపురోగమనానికి తోడ్పడివుంటే, ఆఫలితం ఇవ్వకకూడా మనం స్పష్టంగా గుర్తించ కలిగేట్టు వుండాలి. అలాకాక, గాంధీపూజకీ, మావోపూజకీ తేడావుందనో, దాన్ని గురించి కొంత అతిశయ ప్రచారం జరిగివుండవచ్చనో చెప్పడం 'గతితార్కికం' కాదు 'వెరైటీ' వుంది కనుక 'వ్యక్తిపూజ' తప్పులేదనడంకన్నా. దానివల్ల విప్లవానికి నిజంగా మేలుజరిగిందా, హానిజరిగిందా అని పరిశీలించాలి.

ఇవాళ రివిజనిస్టులు దాన్నే ప్రధాన ఆయుధంగా తీసుకోవడంవల్ల, సహజంగా 'వ్యక్తిపూజ' సామాజికవాదానికి అనుకూలం కాదుకనుక, అది విప్లవానికి హానికల్గిం

చిందనే (విప్లవం....ఎన్నికల్లో గెలవడంలాంటిదికాదుకనుక) నిర్ణయించుకోకతప్పదు. మేలు జరిగిందంటే దాన్ని నిరూపించడం అన్నవాళ్ళ బాధ్యత. ఉపరితలాన్ని పరిశీలన చేయడం మాత్రమేకాక పునాదినే సోషలిస్టుగా మార్చాలని చైనానాయకులు గుర్తించక పోవడం వాళ్ళ సిద్ధాంత అవగాహనలో పొరపాటుగా వ్యాఖ్యనిస్తూ, "సాంస్కృతిక విప్లవంలో ఉపరితలాన్ని మార్చడానికి చేసిన ప్రయత్నాలు పునాదిదాకా దారితీసాయి" అన్న రంగనాయకమ్మగారి అభిప్రాయాన్ని 'శుద్ధతర్కం'గా భావించారు బాలగోపాల్ గారు.

చైనా కమ్యూనిస్టు పార్టీకి 'గతితర్కం' వుందని వివరించారు. ప్రజలకు కనీస కార్యక్రమాన్ని ఇచ్చి, వాళ్ళు దాన్ని అందుకుని ముందుకువెళితే, అప్పుడు పార్టీ తన కార్యక్రమాన్ని మరింత అభివృద్ధి చేసుకునే విధానాన్ని అనుసరించిందని. ఈవిషయంలో పార్టీని తప్పుపట్టడానికి వీల్లేదనీ అన్నారు. అంటే, ప్రతిదశలోను కేవలం నాయకులుకాక కార్యక్రమంలో ప్రజల్ని పాల్గొనేట్టు పార్టీపనిచేస్తూ వచ్చిందన్నమాట.

మరి 'సాంస్కృతిక విప్లవం' ఎందుకు విజయవంతం కాలేదు? ఇందుకు పార్టీని తప్పుపట్టకపోతే ప్రజలను తప్పుపట్టాలా? బాలగోపాల్ గారు చెప్పిన 'గతి తర్కం' ప్రకారం ప్రజలు ఆ కార్యక్రమాన్ని అందుకుని ముందుకువెళ్ళే సందర్భంలో మాత్రమే ముందటి కార్యక్రమాన్ని పార్టీ తీసుకుంటుంది కనుక ఈ పరిస్థితే వుండకూడదు. వుంది కనుక, సిద్ధాంత అవగాహనలో పొరపాటు జరిగిందనుకోక మరేమనుకోవాలి? అలా అనుకోవడాన్ని 'శుద్ధతర్కం'గా ఆక్షేపించిన బాలగోపాల్ గారు 'ఉపరితలాన్ని విప్లవీకరించడానికి బయలుదేరిన విప్లవం పునాదిలోనే యింకా విప్లవం రావలసి వుందని గుర్తించింది' అన్నారు. మాటలతేడా మూడు విప్లవాల తేడా తప్ప, రంగనాయకమ్మగారు చెప్పిన అభిప్రాయానికీ, దీనికీ భేదమేమిటి?

"సాంస్కృతిక విప్లవం వైఫల్యం చెందడానిక్కారణం విప్లవ పార్టీని నిర్మించుకోలేక పోవడం, ఈ విషయం బెతల్ హామ్ కిగాని, రంగనాయకమ్మగారికిగాని అందలేదు" అనడం చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. వాళ్ళిద్దరికీ ఆ సంగతి అర్థమయిందా లేదా అన్నది అలా వుంచుదాం. నాకూ నాలాంటి వారెందరికో బాలగోపాల్ గారు చెబుతున్నది ఏమాత్రం అర్థం కాలేదనే అనుకుంటున్నాను. విప్లవ పార్టీ నిర్మాణమే కాకపోతే విప్లవం ఎలా సాధ్యమైనట్టు? అంతకుముందు ఆయన వివరించిన 'గతి

తర్కం' గతేమయినట్టు? "చైనా విప్లవంలోని ప్రత్యేకత ఏమంటే ప్రజాఉద్యమం ద్వారా ముందుకురావడం. రెగ్యులారిటీ ప్రకారం నడవడానికి కమ్యూనిస్టు పార్టీ మునిసిపల్ కార్పొరేషన్ లాంటిదికాదు. దానికర్తవ్యం విప్లవం నడపడం, విప్లవంలో ప్రజల్ని పాల్గొనేట్టుచేయడం ..." అన్నారే! ఇదంతా విప్లవపార్టీ నిర్మాణం కాకుండానే జరిగిందా? తను ముందు చెప్పిందేమిటో తనే విస్మరించి, దిగ్భ్రాంతిని కల్గించే కారణం చెప్పి, బెతల్ హామ్, రంగనాయకమ్మగారు గ్రహించలేక పోయారని ఆక్షేపించడమేమిటి?

బాలగోపాల్‌గారి విజ్ఞత, విచక్షణలమీద విశ్వాసం వున్న నాకు ఈ సమీక్షా వ్యాసం చాలా ఆశ్చర్యం కల్గిస్తున్నది. ఇంక- తెలుగులో వచ్చిన ఈ పుస్తకం చదివినదగ్గర్నుంచి చాలామంది పాఠకులు మానవ భవితవ్యం గురించి భయపడటం.... సంగతి. బెతల్ హామ్ పుస్తకానికి, రంగనాయకమ్మగారి పుస్తకానికి వున్న తేడా నాకు తెలీదుకాని, ఒకదేశంలో విప్లవం విజయవంతమైనా, అక్కడ పార్టీలోను, నాయకుల్లోను, దేశంలోపలి పరిస్థితిలోను విప్లవానుకూల పరిస్థితులు లేకపోతే విప్లవం నిల్వదని చెప్పే 'శుద్ధతర్కం' కన్నా పార్టీలో, నాయకుల్లో ఎటువంటి లోపాలు లేక పోయినా, దేశంలోపలి పరిస్థితితో పనిలేకుండా, ప్రపంచవ్యాప్తంగా విప్లవ పరిస్థితి లేకపోతే మాత్రం అక్కడ విప్లవం నిల్వదని చెప్పే 'గతితర్కమే' ఎక్కువ భయాన్ని, అవిశ్వాసాన్ని కలిగిస్తుందనుకుంటున్నాను. అందుకు 'గతితర్కం' లోపం కాదని, ఇలా చెప్పడం 'గతితర్కం'గా అన్వయించడంలోనే లోపముందని అనుకుంటున్నాను.

— పి. రామకృష్ణారెడ్డి

జవాబు

రామకృష్ణారెడ్డిగారి లేఖలో నాలుగు విషయాలకు సమాధానం చెప్పాల్సిన అవసరం వుంది.

1. 'సాంస్కృతిక విప్లవాన్ని గురించి తెలుసుకుంటేకాని దాన్ని వ్యతిరేకిస్తున్న రివిజనిజం స్వరూపాన్ని పూర్తిగా తెలుసుకున్నట్టుకాదు' అన్నారు. ఇక్కడ పూర్తిగా తెలుసుకోవడం తెలుసుకోకపోవడం అనేది సమస్యకాదు. దాన్ని రివిజనిజంగా గుర్తించడానికి సాంస్కృతిక విప్లవాన్ని గురించి ఒక అంతిమ నిర్ణయానికి రావలసిన అవసరంలేదు. నేను ఈ విషయాన్ని నా సమీక్షలో వివరించాననే అనుకున్నాను. సోషలిస్టుదశలో వర్గపోరాటాలకు తావులేదనడం, ఉత్పత్తిశక్తులను అభి

వృద్ధిచేయడమే ప్రధానకర్తవ్యం అనడం, వర్గస్వభావంతో ప్రమేయంలేని ఆధునికీకరణను ప్రధానలక్ష్యంగా ముందుకుతేవడం, పాశ్చాత్యదేశాలనుండి పెట్టుబడినీ సాంకేతిక పరిజ్ఞానాన్నీ పెద్దఎత్తున దిగుమతి చేసుకోవడం, సామ్రాజ్యవాద సోషల్ సామ్రాజ్యవాద దేశాలతో శాంతియుత సహజీవనంకోసం పాకులాడడం- ఇవన్నీ రివిజనిస్టు లక్షణాలే. ఒకవేళ సాంస్కృతిక విప్లవంలో జరిగినవి అన్నీ తప్పులే అయినా ఇవి రివిజనిస్టు లక్షణాలు కాకుండపోవు.

2. 'సాంస్కృతిక విప్లవంలో ఉపరితలాన్ని మార్చడానికి చేసిన ప్రయత్నాలు పునాదిదాకా దారితీసాయి' అన్న రంగనాయకమ్మగారి మాటలను నేను శుద్ధ తర్కం అనలేదు. చైనాకమ్యూనిస్టుపార్టీ తన తీర్మానాలలో ఈవిషయాన్ని గుర్తించినట్టుగా ప్రకటించనంత మాత్రాన దీన్ని పార్టీయొక్క అవగాహనలో లోపంగా ఎంచడాన్ని 'శుద్ధతర్కం' (అంటే అచారిత్రికమయిన వాదన) అన్నాను. అలా అనడానికి గలకారణాన్ని గూడ వివరించాను.

3. వ్యక్తిపూజను కమ్యూనిస్టులు అంగీకరించరని, దాని గురించి రెండు అభిప్రాయాలకు తావులేదని స్పష్టంగానే చెప్పాను. అయితే దీన్ని గూడ అచారిత్రికం(ahistorical)గా చూడకూడదు అన్న అభిప్రాయంతో, సాంస్కృతిక విప్లవంలో అది ఏసందర్భంలో ముందుకొచ్చిందో (నాకు అర్థమయిన మేరకు) వివరించే ప్రయత్నం చేసాను. వ్యక్తిపూజ తప్పుకాదని నేను అనలేదు. అది నా అభిప్రాయం కాదు.

4. 1949లో విప్లవం సాధించిననాటికీ, ఆ తరువాత చాలాకాలం వరకు, చైనాకమ్యూనిస్టు పార్టీ విప్లవపార్టీయే. కాని సాంస్కృతిక విప్లవం కాలానికి పార్టీ కేంద్రంలోనే రివిజనిజం బలపడింది. దాన్ని పారదోలడానికి అంతర్గతపోరాటం చాలకనే మావో పార్టీమీదికే తిరగబడమని ప్రజలకు పిలుపిచ్చాడు. ఆ తిరుగుబాటుకు నాయకత్వం వహించడానికి (అంటే కొత్తబూర్జువా వర్గంతో వర్గపోరాటం నడపడానికి) ఒక (కొత్త) విప్లవపార్టీ అవసరం. దాన్ని నిర్మించుకోలేకపోవడం సాంస్కృతిక విప్లవం వైఫల్యానికి గల ముఖ్యకారణాలలో ఒకటి. ఈ విషయాన్ని రంగనాయకమ్మగారు, బెతెల్‌హాం, గుర్తించలేదని అన్నాను. ఇందులో అర్థంకాకపోవడానికి ఏముందో నాకు అర్థం కావడంలేదు.

మిగిలినవి (ఏమయినా వుంటే) అభిప్రాయభేదాలు. నా అభిప్రాయాలు సమీక్షలో తెలిపాను.

— కె. బాలగోపాల్

గిట్లాంటి పెద్దన్న అచ్చినప్పట్నుంచి క్రాంతి, రాడికల్ మార్చ్, సృజనలు చదువేత్తానం కాని గిట్లాంటి కథ మాత్రం "దొంగ గొడ్డుకు లొటారం" ఎప్పుడూ పదువలే కొందరన్నలు రాజన్నోలెనే జేత్తన్నరంట. గట్లాంటోళ్లు రాడికల్ పేర్జెప్పి మందిని బెదిరించి కొంత సంపాయించి ఎనుకటి భూస్వాములోల్నె జేత్తన్నరు. గట్లాంటోళ్ళకి గిట్లాంటి శిచ్చ తప్పక పడాలె. గట్లాంటోళ్ళకి గీకథ బుద్ధి సెప్పాలె, గిట్లాంటి కథలు అచ్చేసి సంఘాన్ని ముందుకు నడుపాలె. గిట్లాంటి కథరాసిన అన్న రామన్నకు అచ్చేసిన మీకు మా ఎర్రి దండాలు. మానోంటోళ్ళ కట్టాల్ని కథలల్లె వార్ని గవర్నమెంటోళ్లు బాధపెడ్తె తప్పకుండా మాలాంటోళ్ళం ఎదురు తిరుగుతాం, ఖండిస్తాం, లాల్ సలామ్.

ఇట్లు

రాడికల్ యువజన సంఘం

గూనిపర్తి

హుజూరాబాద్ తాలూకా,

కరీంనగర్ జిల్లా,

---

## సృజన ఆఫీసుపై పోలీసుల దాడి

నవంబర్ 21 రాత్రి సృజన ఆఫీసుపై పోలీసులు దాడిచేసి సాహిత్యంతో పాటు సృజన, అరుణతారలకు వచ్చిన కొన్ని రచనలు కూడా ఎత్తుక పోయారు. అంతేకాకుండా మా విజ్ఞప్తిని పురస్కరించుకుని సృజనలో ప్రచురణార్థం పరిశీలనకై పలుచోట్లనుంచి వచ్చిన కరపత్రాలను కూడా ఎత్తుకపోయారు పోలీసుల ఈ చర్యను ఖండించవలసిందిగా ప్రజాస్వామ్య వాదులకు విజ్ఞప్తి.

# 1984 సూచిక

| కవి / రచయిత | శీర్షిక | సంచిక | పేజి |
|---|---|---|---|

పుస్తక సమీక్ష, సమీక్షా వ్యాసం

| | | | |
|---|---|---|---|
| ఓల్గా | కుటుంబంలోపల....(పియుడిఆర్) | 156 | 35 |
| కె. బాలగోపాల్ | శ్రామికవర్గ సాంస్కృతిక విప్లవం | 155 | 41 |
| పి.జె. వర్ధనరావు | కళ్యాణరావు నాటికలు నాలుగు | 156 | 38 |
| పృథ్వి | తేజస్వినీ తీరాన.... | 158 | 12 |
| ప్రాణహిత | తెలంగాణా శ్రామిక గేయాలు (లింగారెడ్డి) | 148 | 57 |
| ,, | ఆదిలాబాద్ అడవి కథలు | 150 | 75 |
| బి.కె.ఆర్. | ఈ నాటికే.... (నిఖిలేశ్వర్) | 156 | 42 |
| రహి | భావ విప్లవకారుడు కొడవటిగంటి | 148 | 54 |
| సాహితీమిత్రులు | సంకెళ్లు విరుస్తున్న 'బందీ' | 156 | 53 |
| సురా | పోరాట వర్తమానంలో 'కొమురం భీం' | 150 | 94 |
| — | జానకి విముక్తి (రంగనాయకమ్మ) | 149 | 58 |
| — | ,, | 151 | 72 |
| — | ,, | 152/153 | 59 |
| — | ,, | 154 | 58 |

నాటిక

| | | | |
|---|---|---|---|
| బుద్ధుడు | బోధివృక్షం | 149 | 21 |

రిపోర్టు

| | | | |
|---|---|---|---|
| — | విరసం పదవ రాష్ట్ర మహాసభలు | 148 | 61 |
| — | జులై 4: రగిలేనాదాలు జనరావాలు' వినిపిస్తాయి | 154 | 69 |

ప్రకటన

| | | | |
|---|---|---|---|
| శ్యామల | సాహిత్య అకాడమీ అవార్డుతిరస్కృతి | 147 | 86 |

| కవి / రచయిత | శీర్షిక | సంచిక | పేజి |
|---|---|---|---|
| **సంస్మరణ** | | | |
| — | మిహాయిల్ షొలఖోవ్ | 149 | 69 |
| 'సాహితీమిత్రులు' | కామ్రేడ్ డి.వి.కి జోహార్లు | 154 | 70 |
| **కరపత్రం** | | | |
| ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం | అభివృద్ధి కార్యక్రమాలు ఎందుకోసం? | 148 | 67 |
| " | కర్నూల్లో జనజీవితం | 156 | 61 |
| రాడికల్ విద్యార్థిసంఘం | 'పార్వతమ్మ-భగవతి'లకు రక్షణలేదా? | 152/153 | 65 |
| రాడికల్ విద్యార్థి యువజన రైతుకూలీ సంఘాలు | పోలీసుల దారుణ మారణ విధ్వంసకాండను ఆపేదెవరు? | 154 | 66 |
| రైతుకూలీసంఘం, రాడికల్ యువజన సంఘం | కాజీపేట దొరల దోపిడీ దౌర్జన్యాలు నశించాలి! | 157 | 50 |
| **సాహిత్య లేఖ** | | | |
| కాకరాల | ప్రజల నుంచి ప్రజల్లోకి | 148 | 72 |
| జయధీర్ తిరుమలరావు | సాంస్కృతిక సమర రంగంలో రాజకీయ పాఠంగా ప్రజాసినిమా | 149 | 65 |
| నారాయణ | రచయితలారా, పల్లెప్రజలతో కలిసిపొండి | 148 | 71 |
| సురా | సాంస్కృతిక సమరరంగంలో రాజకీయ పాఠంగా ప్రజా సినిమా | 147 | 87 |

**సంపాదకీయం**

| | | |
|---|---|---|
| 147 | జనవరి | ప్రజల తీర్పు |
| 148 | ఫిబ్రవరి | జనవరి సంచిక ఆలస్యానికి సంజాయిషీ |

అగ్నిపూలు విలేఖరి బి. సాయన్నపై ఆర్మూర్‌లో ఎ. బి. వి. పి. పార్టీకి చెందిన దాదాపు 25గురు వ్యక్తులు ముకుమ్మడిగా దాడి జరిపి స్పృహతప్పిపోయేలా కొట్టి, విలేఖరి గుర్తింపుకార్డు బలవంతముగా లాక్కున్నారు. ఈ పాశవిక చర్యను సృజన తీవ్రంగా ఖండిస్తున్నది.

— సాహితీ మిత్రులు

## కామ్రేడ్ సి.పి.కి విప్లవ జోహార్లు

నక్సల్బరీ రైతాంగ పోరాటకాలంనుంచి కన్నుమూసేదాకా దాదాపు పదహారు సంవత్సరాలు విప్లవోద్యమ నిర్మాణంలో రహస్య జీవితంలోవుంటూ గుండెపోటుతో మరణించిన కామ్రేడ్ చండ్ర పుల్లారెడ్డి జీవితాంతమూ కమ్యూనిస్టుగా జీవించిన సమరయోధుడు.

గిండీ ఇంజనీరింగ్ కాలేజ్ విద్యార్థిగా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి, వలస విధానానికి వ్యతిరేకంగా పోరాడుతూ కళాశాలను బహిష్కరించినప్పటినుంచీ వలబై సంవత్సరాలుగా సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యవస్థను ప్రతిఘటించడంలో ఆయన రాజీలేకుండా జీవించాడు.

తెలంగాణ రైతాంగ సాయుధపోరాట వారసత్వాన్ని నక్సల్బరీకి అందించిన అరుదైన విప్లవనాయకుల్లో ఆయనొకరు. ప్రజాశక్తి మీదకాకుండా ఆ పేరుతో పత్రికల్లో బతుకుతూ రివిజనిజం ఊబిలో కూరుకపోయిన సిపిఐఎంలాంటి పార్టీలు ఇవ్వాళ చరిత్రను కూడ తిప్పిరాయవచ్చుగానీ చరిత్ర తన నిర్మాతలయిన ప్రజలను, ఆ ప్రజలను నడిపించిన నాయకత్వాన్ని రక్తాక్షరాలతో పదిలపరచుకుంటుంది.

తెలంగాణ రైతాంగ సాయుధపోరాటంపై వివరమైన, విశ్లేషణాత్మకమైన రచన తీరిక ఆయనకు చిక్కకపోవచ్చును గాని ఉత్తేజకరమైన పుస్తకాన్ని ఆయన [illegible]డు.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమచరిత్ర రచనద్వారా, మావో మిలిటరీ రచనలు, [illegible]నా కమ్యూనిస్టు పార్టీ చరిత్ర అనువాదం ద్వారా కామ్రేడ్ సిపి నక్సల్బరీ తరానికి అంతర్జాతీయ శ్రామికవర్గ చైతన్యాన్ని వ్యూహాన్ని, చరిత్రజ్ఞానాన్ని అందించాడు.

విప్లవ రచయితల సంఘం నిర్మాణకాలంనుంచీ కనీసం విరసం అయినా విప్లవ ఐక్య వేదికగా వుండి సాంస్కృతిక రంగంలో కృషిచేయడానికి దోహదం చేసిన నాయకత్వంలో కామ్రేడ్ సిపిని సంస్మరించుకోవాలి.

సాంస్కృతిక రంగంలో అనుసరించదగిన పద్ధతులగురించి కామ్రేడ్ సిపితో సృజనకు మమేకతలేదు. అట్లాగే తెలంగాణ, నక్సల్బరీ గుణపాఠాలు, వర్తమాన, భవిష్యత్ కార్యక్రమ వివరాల్లో కూడ అవగాహనలో పూర్తి ఏకీభావంలేదు.

కాని కామ్రేడ్ సిపి మరణం విప్లవోద్యమానికి తీరనినష్టం అని గుర్తించడంలో ఆ తేడాలు కంటిలోని నలుసుల్లాంటివి.

ఆమరణాంతం విప్లవోద్యమ సమరయోధుడుగా, నాయకుడుగా జీవించిన కామ్రేడ్ సిపికి విప్లవ జోహార్లు.

Regd. No. with Registrar of Newspapers 10953/67

# చీకటిదారుల్లో చంపబడుతున్న వాళ్ళం

(ఎథిల్, జూలియస్ రోజెన్‌బర్గ్‌లు)

ఉజ్వలమైన నీ పెదాల్ని వికసింపజేయాలనే కోరిక
మమ్మల్ని ప్రాణంలేని ఉరికంబం మీదికి నడిపించింది
కొవ్వొత్తులలా వెలిగే నీ చేతుల అగ్ని మమ్మల్ని మసక చీకట్లోకి నడిపించింది
మేం, చీకటిదారుల్లో చంపబడుతున్న వాళ్ళం.
నీ ఉజ్వలమైన పెదాల్లో ఎగసిపడే అరుణిమ
కదలాడే ముంగురుల మత్తెక్కించే పరిమళం
నీ వేళ్ళ కొసల వికసించే వెండి మెరుపు
నిరీక్షిస్తున్న మా నోళ్ళనుంచి ఇంకా అందరాని దూరంలోనే ఉన్నాయి
దారుల మీద బాధల సంధ్యా సమయం పరుచుకొన్నప్పుడు
మా బాధే నీ సౌందర్యానికి సాక్షంగా
పెదాలమీద మెదలే కవితలలో, గుండెల్లో వెలిగే కాగడాలతో
ఈ కాళ్లు నడవగలిగినంత దూరం మేం నడిచాం
చూడు మేం ఇంకా ఈ సాక్ష్యంతో దృఢంగానే ఉన్నాం
ఓటమే మా గతి అయితే ఆకాంక్షల వేడిమే మా స్వేచ్ఛా నిర్ణయం
ప్రేమ చిక్కదార్లు కలుసుకునే వేళ
కలయికలన్నీ అంతమైపోయే ఈ ప్రాంతాన
ఆ వేడిమికి కన్నీళ్ళు లేవు
ఏ ప్రాంతం నుంచి ఇంత మనుషులు రక్తసిక్తంగా విడుదలవుతారో
ఆ వియోగ వధ్యశాలలనుంచి
కొత్త ప్రేమికుల సమూహాలు
మన పతాకాన్నెత్తి పట్టి అన్వేషణను కొనసాగిస్తాయి
వాళ్ళ వేసనా దూరాన్ని మా అడుగులు తగ్గిస్తాయి
వాళ్ళకోసమే మానవ జాతి ఏకత్వాన్ని కాంక్షిస్తూ
నీ పెదాల కలయికను సిద్ధం చేశాం, మేం,
మేం, చీకటి దారుల్లో చంపబడుతున్న వాళ్ళం

1950లో ఎథిల్ జూలియస్ రోజెన్‌బర్గ్‌లను అమెరికన్ ప్రభుత్వం ఉరితీసింది.
సంవత్సరాల తర్వాత కారాగారంలో విడివిడిగా ఒంటరి సెల్లో ఉంటు ఆ ద
లిద్దరు ఒకరికొకరు రాసుకున్న లేఖలు ప్రచురితమయ్యాయి. ఆ ఉత్తరాల ప్రేర
ఫైజ్ ఈ గీతాన్ని 1954 మే 15న తాను మాంట్‌గోమెరీ జైలులో ఉండగా రాసె